# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము

సంపుటము 40 | మే 1997 | సంచిక 5

## విషయసూచిక



ప్రింటర్ అండ్ పబ్లిషర్ : పి.కె.సూరి    ఎడిటర్ : వి.కె.నరసింహన్



సంవత్సర చందా: తెలుగు లేక ఇంగ్లీషు (ఒక్క సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడును)

ఇండియాలో : రూ. 30/-

విదేశాలకు : ఎయిర్‌మెయిల్ - రూ.240/- లేక యు.ఎస్.డాలర్లు 8 లేక యు.కె. పౌండ్లు 5
సీ మెయిల్ - రూ.120/- లేక యు.ఎస్.డాలర్లు 4 లేక యు.కె. పౌండ్లు 3

చందా పంపవలసిన చిరునామా : కన్వీనర్, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, పిన్‌కోడ్ - 515134

సాధారణ సమాచారము: (1) చందాదారుని పేరు, పూర్తి చిరునామా పెద్ద అక్షరములతో వ్రాయవలెను. (2) భారత దేశములో ఏ చోటకయినా పత్రిక చందా మనియార్డరు ద్వారాగాని, బ్యాంకు డ్రాఫ్టు ద్వారాగాని చెల్లించవచ్చును. (3) క్రొత్త చందాయో లేక రెన్యువల్ చందాయో తెలియపరచవలెను. రెన్యువల్ అయినచో ప్రస్తుత చందా నెంబరు వ్రాయవలెను. (4) రెన్యువల్ కోరునప్పుడు చందా గడువు ముగియుటకు రెండు నెలలు ముందుగా తిరిగి చందా రుసుమును పంపవలెను. (5) ఈ పత్రిక శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టువారి తరఫున శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్, ప్రశాంతినిలయంలో ముద్రించబడినది.

ఫ్యాక్స్ : 0091-8555-87236/87390, గ్రామ్స్ : 'బుక్‌ట్రస్ట్'
టెలిఫోన్: 87375, STD కోడ్: 08555, ISD కోడ్: 0091-8555

# 'దైవం మానుష రూపేణ'

********************

''నువ్వులయందు నూనె ఉన్నట్లుగా, పాలయందు వెన్న ఉన్నట్లుగా, పుష్పముయందు సుగంధమున్నట్లుగా, ఫలముయందు రసమున్నట్లుగా, కట్టెలయందు నిప్పున్నట్లుగా దృశ్యకల్పితమైన ఈ జగత్తంతయు భగవంతుడు నిండియున్నాడు. కన్నులయందు చూపువలె, చెవులయందు వినికిడివలె భగవంతుడు దేహమునందు చైతన్య స్వరూపుడై ప్రకటితమవుతున్నాడు. ''

సృష్టి అనగా ఈశ్వరేచ్ఛకు ప్రకటనయే. అనగా ఈశ్వర స్వరూపమే. దీని పేరే ప్రకృతి. ఈ ప్రకృతియందు పుట్టిన ప్రతి మానవునియందు ఈశ్వరభావములే ఆవిర్భవించాలి. చైతన్య స్వరూపుడైన భగవంతుని వ్యక్తీకరించే నిమిత్తమై మానవుడు ఆవిర్భవించాడు. దీనికి సంబంధించి వేదము ప్రత్యేకమైన ప్రమాణములను బోధించింది. ''సత్యం బ్రూయాత్,'' సత్యమునే పలకాలి. ఇది నైతికమైన విలువ. ''ప్రియం బ్రూయాత్,'' ఈ సత్యమును కూడా ప్రియమైనరీతిలో ఉచ్చరించాలి. ఇది ధార్మికమైన విలువ. ''న బ్రూయాత్ సత్యమప్రియం, '' సత్యమనేది అప్రియమైనదిగా ఉండకూడదు. ఆనందకరంగాను, ఆకర్షణీయంగాను ఉండాలి. అయితే ఎదుటివానికి ప్రియము కదాయని అసత్యము చెప్పకూడదు.

''అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియ హితం చయత్.'' ప్రతి పలుకు అనుద్వేగకరంగాను, సత్యంగాను, ప్రియంగాను, హితంగాను ఉండాలి. ఒక మహారాజు ఒక ఎస్ట్రాలజర్ పేరుప్రతిష్ఠలు ఆనోట, ఈనోట విని అతనిని తన భవనానికి పిలిపించాడు. ఈ ఎస్ట్రాలజర్‌కు కాలు మొదలు తల వరకు అహంకారమే! అందులోను రాజుగారే స్వయంగా తనను పిలిపించారనే గర్వము ఇతనిలో బయలుదేరింది. రాజువద్ద ఏవిధంగా మాట్లాడాలి? ఏమి చెప్పాలి? ఏమి చెప్పకూడదు? అనే విచక్షణ ఇతనిలో శూన్యమైపోయింది. రాజువద్దకు వెళ్ళి జాతకం చూసి, ''రాజా! నీకుమారులంతా త్వరలోనే చచ్చిపోతారు'' అన్నాడు. దానితో రాజుకు కోపం వచ్చి ఇతనిని జైలులో పెట్టించాడు. అయితే ఇతడు చెప్పింది నిజమే. కాని నిజమునైనా చెప్పవలసిన రీతిలో చెప్పాలి. రాజు ఇంకొక ఎస్ట్రాలజర్‌ను పిలిపించాడు. అతడు రాజువద్దకు వినయంగా వచ్చాడు, జాతకమును చూశాడు, ''రాజా! మీరు దీర్ఘకాలం జీవిస్తారు. మీరు జీవించినంత కాలము మీ పిల్లలు కూడా జీవించరు'' అన్నాడు. ఈ మాటలు రాజుకు కొంతవరకు తృప్తికరంగా తోచాయి. కనుక మనం చెప్పే మాటలలో మాధుర్యం ఉండాలి. మొదట వచ్చిన ఎస్ట్రాలజర్ రాజుతో, '' నీ పిల్లలందరూ చచ్చిపోతారు. నీవు మాత్రం చాలకాలం ఉంటావు'' అన్నాడు. ఈ మాటలు

ఎంత కఠినంగా ఉన్నాయి చెప్పండి! ఎవరైనా గ్రుడ్డి వానిని, ''ఓ గ్రుడ్డివాడా! ఇటురా'' అని పిలిస్తే అతడు చాల బాధపడతాడు. అట్లుగాకుండా అతని దగ్గరకు వెళ్ళి, ''ఓ సూరదాసూ! ఇటు రండి'' అని పిలిస్తే ఎంత ఆనందిస్తాడు! కనుక మనం పలికే ప్రతి పలుకు చాల మధురంగా, ప్రీతికరంగా ఉండాలి. ఆవిధంగా ఉండాలంటే హృదయం మొట్టమొదట ప్రేమమయం కావాలి.

*మానవత్వం ఎంతో పవిత్రమైనది :* నైతికము, ధార్మికము, ఆధ్యాత్మికము - ఈ మూడింటి యొక్క సమ్మిళిత స్వరూపమే మానవత్వము. కాని మానవుడీనాడు ఈ మూడింటినీ విస్మరించాడు. మానవత్వ మనగా ఎంత పవిత్రమైనదో విచారిస్తే ఈనాటి మానవుడు సిగ్గుపడవలసి వస్తుంది. సత్యము, ప్రేమ, సహనము, దయ, సానుభూతి ఇత్యాది గుణములచేత వర్థిల్లిన ఈ భారతదేశంలో ఈనాడు ఎక్కడ చూసినా నిర్దయ, స్వార్థము, కఠినత్వము ఇత్యాది దుర్గుణములు తాండవ మాడుచున్నవి. ప్రేమ అనేది ఎక్కడా కనిపించడం లేదు. ఈనాడు మహనీయుల విగ్రహాలను ప్రతిష్ఠించి పూజిస్తున్నారుకాని, ఆయా మహనీయులు ప్రబోధించిన మంచి విషయాలను మాత్రం భూమిలో పూడ్చిపెడుతున్నారు. ఎందుకీ ఆడంబరాలు? ఎందుకీ నాటకాలు? విగ్రహములను పూజించడం, ప్రబోధములను విస్మరించడం మానవత్వం కాదు. మానవునికి, మానవునికి మధ్యగల సంబంధ బాంధవ్యాన్ని గుర్తించి వర్తించడమే నిజమైన మానవత్వం.

***త్రిమూర్తులు మానవునియందే ఉన్నారు :*** మీరు బ్రహ్మావిష్ణుమహేశ్వరులను పూజిస్తున్నారు. కాని వీరిని చూసినవారు ఈ జగత్తులో ఎవ్వరూ లేరు. అయితే వీరి ఉపాధులు ఏమిటి? ప్రతి మానవుని యందున్న సత్త్వరజస్తమో గుణములే వీరి ఉపాధులు. ఈశ్వరు డనగా ఎవరు? వేదములు ఈశ్వరత్వమును 'ఆత్మ' అని పిలుస్తూ వచ్చాయి, హృదయమును కూడా 'ఆత్మ' అని ప్రకటిస్తూ వచ్చాయి. కనుక హృదయమే ఈశ్వర స్వరూపము. ''ఈశ్వరస్సర్వభూతానాం.'' హృదయమునకే ఈశ్వరుడని పేరు. ఇతని సంకల్పమే మనస్సు. ఈ మనస్సే విష్ణుస్వరూపం. విష్ణువనగా సర్వ వ్యాపకుడని అర్థం. కనుక మనస్సు కూడా సర్వత్ర వ్యాపించియున్నది. ''మనోమూల మిదం జగత్.'' జగత్తంతా మనోమయమే. ఈ మనస్సు నుండి ఆవిర్భవించినదే వాక్కు. విష్ణువు యొక్క నాభి నుండి ఉద్భవించినవాడే బ్రహ్మ. కనుక వాక్కే బ్రహ్మత్వము. కనుకనే, ''శబ్దబ్రహ్మమయి, చరా చరమయి, జ్యోతిర్మయి, వాఙ్మయి ... '' అని బ్రహ్మత్వము వర్ణింపబడింది. ఏతావాతా హృదయము, మనస్సు, వాక్కు - ఈ మూడింటి యొక్క తత్త్వమే మానవత్వము. హృదయమే ఈశ్వరత్వము, మనస్సే విష్ణుత్వము, వాక్కే బ్రహ్మత్వము. కనుక బ్రహ్మవిష్ణుమహేశ్వర స్వరూపములు మూడూ ప్రతి మానవునియందు ఉంటున్నవి. ఇట్టి మానవత్వాన్ని మర్చిపోయి కేవలం ప్రాకృతమైన కర్మలను ఆచరిస్తున్నాము. ఇవి కాదు మనం ఆచరించవలసినవి. అంతర్భావముతో కూడిన ఆచరణ చాల అవసరం.

***మంచిచెడ్డలు కాలములో లేవు :*** ఈనాడు క్రొత్త సంవత్సరము ప్రారంభమైనది. ఇది ఈశ్వరనామ సంవత్సరము. కనుక ఈ సంవత్సరంలోనైనా మనం ఈశ్వర భావములను పెంపొందించుకోవాలి. ఐకమత్యంగా, అన్యోన్యంగా జీవిస్తూ మన

కర్తవ్యకర్మలను నిర్వర్తించాలి. ఈశ్వరు డనగా సకలైశ్వర్య స్వరూపుడు. కనుక ఈ క్రొత్త సంవత్సరము మన కేవో క్రొత్త సుఖములు, సౌభాగ్యములు చేకూర్చుతుందని భావిస్తున్నాము. మన మంచిచెడ్డలనుగాని, కీర్తిప్రతిష్ఠలనుగాని సంవత్సరములు తీసుకొని రావటంలేదు. మనకర్మల ఫలితములే మనకు అందుతూ ఉన్నవి. కనుక నూతన సంవత్సరము మన కేవో మంచిచెడ్డలను తెస్తున్నదని భావించకూడదు. మనం చేసే మంచిచెడ్డల ఫలితమునే మన కందిస్తుంది. మనం మంచిగా నడుచుకుంటే మంచి ఫలితమే వస్తుంది, చెడ్డగా ప్రవర్తిస్తే ఫలితం కూడా చెడ్డగానే ఉంటుంది. మంచిచెడ్డలు కాలములో లేవు, మన సంకల్పములతోనే కూడియుంటున్నవి. కనుక సత్సంకల్పములను పెంచుకోవాలి, సత్సంగములో ప్రవేశించాలి. ఈనాడు మన భారతదేశం బీదదేశ మనుకుంటున్నాము. ఈ బీదరికానికి మూలకారణ మేమిటి? సోమరితనమే! దినములో 24 గంటలలో 23గంటల 55 నిమిషములు దుర్వినియోగం చేస్తున్నాము, ఏదో ఐదు నిమిషములను అంతో ఇంతో సద్వినియోగం చేస్తున్నాము. ఇది కాదు మానవత్వం. కాలమును మనం గౌరవించినప్పుడే కాలము మనలను గౌరవిస్తుంది. కాలమును దుర్వినియోగపర్చితే కాలము కూడా మనలను హింసిస్తుంది.

*యూనిటీ – ప్యూరిటీ – డివినిటీ :* దేశ సౌభాగ్యము ప్రజల ప్రవర్తనపై ఆధారపడియున్నది. దేశ ప్రజలందరూ సత్యధర్మములతో వర్తించినప్పుడే దేశం సుభిక్షంగా ఉంటుంది. ఇంతకుముందు ప్రసంగించిన శివరాజ్‌పాటిల్ ఈనాడు యూనిటీ, ప్యూరిటీ అత్యవసరమన్నాడు. ఈ రెండింటితోపాటు ప్రేమ కూడా ఉండాలన్నాడు. యూనిటీ, ప్యూరిటీ, ప్రేమ - ఈ మూడింటి ఏకత్వంచేతనే డివినిటీ ఏర్పడుతుంది. కాని ఈనాడు ఇంటికి ఇంటికి మధ్య జగడము, రాష్ట్రానికి రాష్ట్రానికి మధ్య జగడము, దేశానికి దేశానికి మధ్య జగడము! ఇంక యూనిటీ ఎలా సాధ్యమవుతుంది! విశాలమైన ఏకాత్మభావాన్ని అభివృద్ధి పర్చుకుంటే ఈ జగడములకు అవకాశమే ఉండదు. అందరియందు ఉన్నవి పంచభూతములే, అందరూ సమానమే. ఇంక మనిషికి మనిషికి మధ్య ఎందుకిన్ని భేదములు! ఉన్నది ఒకే కులం, అదే మానవ కులం. ఉన్నది ఒకే మతం, అదే ప్రేమ మతం. ఉన్నది ఒకే భాష. అదే హృదయభాష. ఈ సత్యాన్ని గుర్తించాలి. ఈనాడు ఎక్కడ చూసినా అందరూ భక్తులుగానే కనిపిస్తున్నారు. నిజంగా అందరూ భక్తులే అయితే ఈ కలహాలు ఎక్కడి నుండి వస్తున్నాయి? ఈ భేదములు ఎక్కడి నుండి పుడుతున్నాయి? ఈ అసూయాద్వేషాలు ఎక్కడి నుండి ఆవిర్భవిస్తున్నాయి? కనుక మీరు భక్తులమని చెప్పుకున్నంత మాత్రమున సరిపోదు. భక్తులకు తగిన గుణములు మాలో ఉన్నవా అని విచారణ చేసుకోవాలి.

*మితిమీరుతున్న ధనదాహం, అధికారదాహం :* ఈనాడు ప్రతి వ్యక్తి, ''ఈ సమాజమువల్ల నాకు వచ్చిన లాభమేమిటి?'' అని ప్రశ్నిస్తున్నాడుకాని తనవల్ల ఈ సమాజమునకు లభిస్తున్న సహాయ మేమిటి? అని ప్రశ్నించుకోవడం లేదు. ప్రతి ఒక్కరు సమాజము నుండి తమకేదో కావాలని ఆశిస్తున్నారుకాని తాము సమాజానికేదీ ఇవ్వటానికి సిద్ధంగా లేరు. అందులోను ఈ కలి ప్రభావంచేత ధనదాహము, అధికారదాహము మితిమీరిపోతున్నాయి. సిటీలలో పోయి చూసే

ఎక్కడ చూసినా ఒకటే రద్దీగా ఉంటున్నది. ఇక్కడ పోయే కారు, అక్కడ పోయే కారు, ఇక్కడ పోయే మనిషి, అక్కడ పోయే మనిషి - అంతా బిజినెస్సే! ప్రతి వ్యక్తి ధనంకోసం ప్రాకులాడుతున్నాడు, ధనంకోసమే జీవిస్తున్నాడు. ధనంకోసం మానవుడు దానవుడుగా మారిపోతున్నాడు. పోనీ సంపాదించిన ధనము నేమైనా సద్వినియోగం చేస్తున్నాడా? ఏమీ లేదు. ''తుదకు దొంగల కిత్తురో? దొరల కౌనో?!''

ప్రేమస్వరూపులారా! ధనమును ఆశించండి, సంపాదించండి, తప్పు లేదు. అయితే సమాజము నుండి సంపాదించిన ధనమును తిరిగి సమాజమునకే అర్పితం గావించండి. ప్రతి వ్యక్తికి ధనము, అధికారము రెండూ ఉండవలసినవే, తప్పు లేదు. కాని వీటిని సక్రమమైన మార్గంలో అనుభవించాలి. ఎవరే స్థానములో ఉన్నారో ఆ స్థానమునకు తగిన గౌరవాన్ని వారు సాధించాలి. ప్రైమ్ మినిష్టర్‌కు తన పనిలో ఎంత అధికార మున్నదో చెప్పులు కుట్టేవానికి కూడా తన పనిలో అంత అధికార మున్నది. కనుక ఎవరి డ్యూటీని వారు సక్రమంగా చేయాలి, అంతే చాలు. 'నేను చిన్నవాడను, అతడు పెద్దవాడు' అని పోల్చుకోకూడదు. నీ పని నీకు గొప్ప, అతని పని అతనికి గొప్ప. ''నా పని నేను చేసుకోవాలి. నా పనిలో ఎట్టి దోషమూ లేకుండా చూసుకోవాలి'' అనే భావనతో ప్రతి వ్యక్తి తన పనిపట్ల శ్రద్ధ వహించినప్పుడు, 'లోకాస్సమస్తా స్సుఖినోభవంతు' అనేది సార్థక మవుతుంది. ఈనాటి మానవుడు 'లోకాస్సమస్తా స్సుఖినో భవంతు' అని ప్రార్థిస్తున్నాడుకాని లోకం సంగతే పట్టించుకోవడం లేదు. తన లోకమే తనకు!

*భగవంతుడు హృదయవాసి :* మన వాక్కే బ్రహ్మ, మనస్సే విష్ణువు, హృదయమే ఈశ్వరుడు. ఈ త్రిమూర్తులు మనలోనే ఉంటున్నారు. ఈ నమ్మకాన్ని పెంచుకున్నప్పుడే మన దృష్టి అంతర్ముఖంగా అభివృద్ధి అవుతుంది. మనం భగవంతుని చూడాలని దేవాలయాల చుట్టూ తిరుగుతున్నాము, అనేక తీర్థయాత్రలు చేస్తున్నాము. కాని ప్రయోజన మేమిటి? ఈనాటి సైంటిస్టు స్థితి కూడా ఇదేరీతిగా ఉంటున్నది. లక్షల మైళ్ళు అంతరిక్షయానంచేస్తున్నాడుకాని అర్ధఇంచైనా హృదయాంతరాళమునకు పోతున్నాడా? ఈనాటి భక్తుడు కూడా యాత్రలు చేస్తున్నాడు, మఠముల చుట్టూ తిరుగుతున్నాడు. దేవుడు నీ హృదయమందే ఉండగా మఠముల చుట్టూ తిరగడ మెందుకు? నీ హృదయాన్ని నీవు చూసుకో, నీ హృదయంలో ఆవిర్భవించే భావములను చక్కగా విచారణ చేసుకో. అప్పుడే నీవు సరియైన మార్గంలో ప్రవేశిస్తావు. హృదయంలో చూస్తే మాలిన్యము, బయట చూస్తే మాధవ నామము - ఇది సరియైన భక్తి కాదు. మొట్టమొదట భగవచ్చింతన ద్వారా హృదయాన్ని పవిత్రం గావించుకోవాలి.

ఏ పని చేసినా దానిని భగవత్కార్యంగానే భావించుకోవాలి. నీ ఇంటిని నీవు శుభ్రం చేసుకో, అదీ భగవత్కార్యమే. ''దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవస్సనాతనః'' దేహమే దేవాలయం, జీవుడే దేవుడు. దేవుడు తిరుపతిలో ఉన్నాడని, బదరీనాథ్‌లో ఉన్నాడని, అమర్‌నాథ్‌లో ఉన్నాడని అటూ ఇటూ తిరగడ మెందుకు! హృదయంలో ఉన్న దైవాన్ని దర్శించలేనివాడు ఎన్ని దేవాలయముల చుట్టూ తిరిగినా అది కాలాన్ని వ్యర్థం చేసినట్లే!

దైవం ఎక్కడో లేదు, నీవే దైవము. ఇంతటి పవిత్రమైన మానవత్వం ప్రసాదింపబడినప్పటికీ దీనిని సక్రమమైన మార్గంలో ప్రవేశపెట్టడం లేదు. పశువులకైనా నియమనిష్ఠలు ఉన్నాయికాని, ఈనాటి మానవునికి నియమం లేదు, నిష్ఠ లేదు. నిష్ఠను ప్రక్కకు పెట్టి ఇష్టాన్ని అనుసరిస్తున్నాడు. నిర్జీవమైన శిలలను పూజిస్తున్నాడుకాని సజీవులైన మానవులను గౌరవించడం లేదు. తోటి మానవులకు సహాయపడని పూజలు పూజలా? కాదు, కాదు. మానవుడు దైవస్వరూపంగా ఉంటున్నాడు. దైవం మానవస్వరూపంలో ఉంటున్నాడు. కనుకనే వేదము, ''దైవం మానుష రూపేణ '' అన్నది. ''మనుష్యులకు నమస్కారం చేయవచ్చునా?'' అనుకుంటారు చాలమంది. ఇంకెవరికి చేయాలి నమస్కారము? దయ్యాలకు చేయాలా?!

*మనిషిశిరస్సు విలువ:* ఒకానొక సమయంలో అశోక చక్రవర్తి తన మంత్రితో కూడి విహారార్థం బయలు దేరాడు. మార్గ మధ్యంలో ఒక బౌద్ధగురువు వారికి ఎదురయ్యాడు. తక్షణమే అశోకుడు తన శిరస్సును ఆ బౌద్ధగురువు యొక్క పాదములపై పెట్టి నమస్కరించాడు. ఈ దృశ్యాన్ని చూసి మంత్రి చాల నొచ్చుకున్నాడు. అశోకచక్రవర్తి అత్యంత విలువైన తన శిరస్సును ఒక సాధారణ సన్న్యాసి పాదములపై పెట్టినాడే అని బాధపడ్డాడు. అతడు పేరుకు మంత్రియేకాని చాల సంకుచిత బుద్ధి గల వాడు. అశోకుని కున్న విశాల హృదయం అతనికి లేదు. ఇంటికివెళ్ళిన తరువాత సమయం చూసుకొని అశోకునితో ఈవిషయాన్ని ప్రస్తావించాడు. కాని అశోకుడేమీ మాట్లాడ లేదు, నవ్వి ఊరుకున్నాడు. సరియైన సమయం చూసుకొని మంత్రికి సత్యాన్ని బోధించాలని సంకల్పించుకున్నాడు.

కొన్ని దినముల తరువాత అశోకుడు ఆ మంత్రిని పిలిపించి, ''మంత్రీ! నాకు మూడు శిరస్సులు కావాలి. ఒకటి మేకశిరస్సు, రెండవది పులిశిరస్సు, మూడవది మనిషిశిరస్సు. ఈ మూడింటినీ తీసుకొని రా'' అన్నాడు. మంత్రి మేకమాంసం అమ్మేవాని వద్దకు వెళ్ళి మేకశిరస్సును తీసుకు వచ్చాడు. అడవికి వెళ్ళి వేటాడి పులి శిరస్సును తీసుకు వచ్చాడు. ఇంక స్మశానమునకు వెళ్ళి అప్పుడే పూడ్చబోతున్న శవము యొక్క శిరస్సును ఖండించి తీసుకు వచ్చాడు. ''రాజా! మీ ఆజ్ఞ ప్రకారం వీటిని తీసుకు వచ్చాను'' అన్నాడు. ''మంచిది, ఈ మూడింటినీ రేపు మార్కెట్‌కు తీసుకువెళ్ళి అమ్ముకొని రా '' అన్నాడు. మరునాడు మార్కెట్‌కు పోతూనే ఎవరో ఒక తిండిపోతు వచ్చి మేకశిరస్సును కొనుక్కున్నాడు. ఇంటిద్వారంపై అలంకారంగా పెట్టుకోవచ్చునని పులిశిరస్సును మరొకడు కొనుక్కున్నాడు. కాని మనిషిశిరస్సును మాత్రం ఎవ్వరూ కొనలేదు. మంత్రి తిరిగి వచ్చి అశోకునితో, ''చక్రవర్తీ! ఈ మనిషిశిరస్సును ఎవ్వరూ కొనటం లేదు '' అన్నాడు. ''సరే, కొనకపోతే పోనీ, ఎవరికైనా ఊరికే ఇచ్చివేసి రా '' అన్నాడు. మార్కెట్‌లో మనిషిశిరస్సును ఫ్రీగా తీసుకోవడానికి కూడా ఎవ్వరూ అంగీకరించ లేదు. మంత్రి తిరిగి వచ్చి, ''మహారాజా! ఊరికే ఇస్తామన్నా దీనిని ఎవ్వరూ తీసుకోవడం లేదు '' అన్నాడు. అప్పుడు అశోకుడు, ''మంత్రీ! జీవ మున్నంత వరకే ఈ శిరస్సుకు విలువ ఉంటుంది. జీవం పోతూనే శిరస్సుకు కూడా విలువ పోతుంది. కనుక జీవ మున్నప్పుడే మహనీయుల పాదములపై శిరస్సు పెట్టి ఆ పవిత్రతను అందుకోవాలి. జీవమున్నంతలోనే శిరస్సును సద్వినియోగం చేసుకోవాలి'' అన్నాడు.

పెద్దల పాదస్పర్శనమే శరీరమునకు సరియైన విలువను చేకూర్చుతుంది. కాని అనేకమంది నాస్తికులు దీనిని విమర్శిస్తుంటారు. ఇది తెలివి తక్కువతనం!

కౌరవపాండవ యుద్ధం జరిగినప్పుడు భీముడు దుర్యోధనుని క్రింద పడగొట్టాడు. దుర్యోధనునిలో ప్రాణం ఇంకా కొంతవరకు మిగిలి ఉండగా భీముడు తన కాలుతో అతని శిరస్సును తన్నాడు. అప్పుడు దుర్యోధనుడు, "భీమా! నేను క్రిందకూలకముందు నా శిరస్సును తన్నియుంటే నా ప్రతాపం చూపించేవాడిని. ఇప్పుడు నా ప్రాణం పోతున్న సమయంలో నా శిరస్సును నీవు కాలుతో తన్నడం గొప్పతనం కాదు. నీవే కాదు, ఇంక కొన్ని నిమిషముల తరువాత కాకులు, గ్రద్దలు కూడా నన్ను కాళ్ళతో తంతాయి" అన్నాడు. కనుక ప్రాణం ఉన్నప్పుడే శిరస్సుకు విలువ నందించు కోవాలి. మహనీయుల పాదములపై శిరస్సును పెట్టి తద్వారా దానిని పవిత్రం గావించుకోవాలి. జీవితం శాశ్వతం కాదు. మనం చేసే కర్మలే శాశ్వత మైనవి, సత్యమైనవి.

దైవానికి మీరు అత్యంత సమీపంగా ఉండాలి. బొగ్గు అగ్నితో చేరినప్పుడు అగ్నిగా మారి పోతుంది కదా! అదేవిధంగా మీరు దైవసన్నిధిలో చేరి దైవస్వరూపులుగా రూపొందాలి. "మేము మానవులము" అని మీరు భావిస్తున్నారు. ఇది మీ భ్రమ. నిజమైన భక్తిప్రపత్తులను మీరు పెంచుకుంటే, 'నేను దైవము' అనే సత్యాన్ని గుర్తిస్తారు. అహం బ్రహ్మాస్మి, ప్రజ్ఞానం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, తత్ త్వం అసి (అది నేనే) అనే ధైర్యము, విశ్వాసము మీలో రావాలి.

ఇది ఈశ్వరనామ సంవత్సరము, సకలైశ్వర్య స్వరూపమైన సంవత్సరము, దివ్యమైన హృదయ సంబంధమైన సంవత్సరము. కనుక హృదయాన్ని పరిశుద్ధం గావించుకోవాలి. ఏవిధంగా? దైవచింతన ఒకటి, సమాజసేవ మరొకటి. ఈ రెండింటి ద్వారానే చిత్తశుద్ధి కల్గుతుంది. చాలమంది పురాణాలు చదవాలన్నా, పూజలు చేయాలన్నా ఆఫీసు పనులవల్ల, బిజినెస్ వ్యవహారములవల్ల తమకు సమయమే చిక్కటం లేదంటారు. సాయంత్రం ఆఫీసు నుండి వస్తూనే చాల అలసిపోయినట్లుగా కుర్చీలో కూర్చుంటారు. దేవాలయానికి పోయి పూజచేసి వద్దామని ఇంట్లోవారు అంటే, "అబ్బే! నాకు టైమ్ లేదు, నేను చాల అలసిపోయాను" అంటారు. ఇలాంటివారు పక్కా సోమరిపోతులే! పోనీ కుర్చీలో కూర్చుని ఏమైనా రెస్ట్ తీసుకుంటారా? లేదే! టీవీ వేసుకొని సినిమా చూస్తారు. టీవీ చూడటానికి సమయం చిక్కటం లేదా? క్లబ్బుకు పోయి కార్డ్స్ ఆడటానికి అలసట అడ్డు రావటం లేదా? దైవచింతన చేయడానికి మాత్రం టైమ్ లేదంటారు. ఇది పచ్చి అబద్ధం. కావలసినంత టైమ్ ఉన్నదికాని దానిని వ్యర్థం చేస్తున్నారు. కాలము భగవత్స్వరూపము. కనుక ప్రతి క్షణమును దైవప్రార్థనచేత సార్థకం గావించుకోవాలి.

*సరియైన ప్రార్థన:* లోకంలో అనేకమంది దైవాన్ని ప్రార్థిస్తున్నారు. కాని దేనికోసం? లౌకికమైన, ప్రాకృతమైన కోరికలు నెరవేరాలని ప్రార్థిస్తున్నారు. ఇది సరియైన ప్రార్థన కానేరదు. దైవప్రేమకోసం ప్రార్థించాలి. దైవప్రేమయే సత్యమైనది, శాశ్వత మైనది, అమరమైనది, అఖండమైనది. భగవంతుడు ఆనందమయుడు, సచ్చిదానంద స్వరూపుడు. అది

ఎటువంటి ఆనందము? కదలిపోయే మేఘమువంటి భౌతికమైన ఆనందము కాదు. అది నిత్య సత్యమైన ఆనందము. కనుక మీరు దైవాన్ని, ''నీ ప్రేమ నాకు కావాలి, నీ ఆనందము నాకు కావాలి'' అని ప్రార్థించాలి. ఈవిధమైన ప్రార్థన సల్పేవాడే నిజమైన భక్తుడు. ''నాకిది కావాలి, అది కావాలి'' అని లౌకికమైన కోరికలు కోరేవాడు భక్తుడే కాదు. నిత్యమైన సత్యమైన దైవప్రేమను మీరు ఆశించాలి. మీలో ఆ దైవప్రేమయే గనుక ఆవిర్భవిస్తే జగత్తంతా ప్రేమమయమే! జగత్తంతా ఆనందమయమే! ఆనందంతో నిండిన నేత్రములతో చూస్తే జగత్తంతా ఆనందమయంగానే కనిపిస్తుంది. ద్వేషపూరితమైన భావంతో చూస్తే జగత్తంతా ద్వేషమయంగానే కనిపిస్తుంది. కనుక ముందు మీ దృష్టిని మార్చుకోండి, సృష్టిని మార్చడానికి ప్రయత్నించ వద్దు. ఇది భగవంతుని యొక్క సృష్టి. దీనిని ఎవ్వరూ మార్చలేరు. మీ పాడుదృష్టిని, పీడదృష్టిని నిర్మూలంగావించుకొని ప్రేమదృష్టిని, శాంతదృష్టిని, సహనదృష్టిని, ఆనందదృష్టిని అలవర్చుకోండి. మీ కంటికి ఎరుపు రంగు అద్దాలను వేసుకుంటే జగత్తంతా ఎఱ్ఱగానే కనిపిస్తుంది. నీలిరంగు అద్దాలను ధరిస్తే జగత్తంతా నీలంగానే కనిపిస్తుంది. అదేవిధంగా మీ హృదయం ప్రేమమయమైతే మీ దృష్టి బ్రహ్మమయమైపోతుంది. సర్వమూ బ్రహ్మమయమే. ఎవ్వరూ మీకు విరోధులు లేరు. ఎవ్వరూ మీకు ద్వేషులు కారు. ''అందరూ నాస్వరూపులే'' అనే విశాలమైన భావాన్ని దినదినాభివృద్ధి గావించు కోవాలి. ఎవరేమి అనుకున్నప్పటికీ మీరు లెక్క చేయనక్కర లేదు. మీరు మంచిమార్గాన్ని అనుసరిస్తున్నప్పుడు మీకు భయమెందుకు? దేనికీ భయపడనక్కర లేదు, ధైర్యంగా ఉండాలి. ధైర్యం ఎప్పుడు వస్తుంది? మంచి పని చేసినప్పుడే ధైర్యం వస్తుంది. కనుక ప్రేమను పెంచుకోండి. ఎటువంటి ప్రేమ? క్షణభంగురమైన ప్రేమ కాదు, సత్యమైన ప్రేమ కావాలి. అదే అమృతత్వము, అదే అమరత్వము.

*[తేది: **8.4.97**న సాయిరమేశ్ హాల్ (బృందావనం)లో శ్రీవారు అనుగ్రహించిన దివ్య సందేశము నుండి]*

***

## మనస్సును లక్ష్యపెట్టకు

మనస్సు ఎట్లు పోతే అట్లు పోనీ. నీవు మాత్రం దాని వెంట పడవద్దు. అది ఇష్టమొచ్చినట్లు తిరిగి కడకు అలసి నీ చెంతకే వచ్చును. మనస్సు ఏమీ తెలియని పసిబిడ్డ వంటిది. తల్లి తన వెంటపడి పిలిచే కొలది బిడ్డ దూరముగా పరుగెత్తుచునే యుండును. ఎప్పుడైతే తల్లి ఆ బిడ్డవైపు చూడక తన పాటికి తాను వెనుకకు తిరుగునో తక్షణమే బిడ్డ తన పాటికి తానే తల్లి చెంతకు పరుగెత్తుకొని వచ్చును. అట్లే నీ నియమం ప్రకారం నీ ఇష్టదైవమును ధ్యానించు, మనస్సును లక్ష్యపెట్టకు. తప్పక నీ ధ్యానమున ఏకాగ్రత ఫలించును. నీవును సఫల మనోరథుడవౌదువు.

-బాబా

# చిత్తశుద్ధి లేని భక్తి నిరర్థకం

*'అక్షయస్వరూపమైన కాలమును నేనే' అన్నాడు భగవంతుడు. కాలము అనంతము, అప్రమేయము. ఇట్టి కాలముతో పోల్చితే మానవుని ఆయుఃప్రమాణము చాల అల్పమైనది. ఎన్నో జన్మల పుణ్య ఫలముచేత లభించినది ఈ మానవ జన్మ. దీనిని కేవలం లౌకిక వ్యవహారముల నిమిత్తమై, ధనకనక వస్తువాహనాదుల నిమిత్తమై వినియోగించి మానవత్వాన్ని వ్యర్థం చేసుకోరాదు. తన తత్త్వాన్ని తాను గుర్తించే నిమిత్తమై మానవత్వం ఏర్పడినదనే సత్యాన్ని ప్రతి వ్యక్తి గుర్తించాలి.*

రైతులు గడచిన మూడు నెలలపాటు విశ్రాంతి తీసుకొని తిరిగి ఈనాటి నుండి తమతమ కర్తవ్య కర్మలలో ప్రవేశిస్తారు. వ్యవసాయ వ్యావహారిక వృత్తులకు ఇది ప్రారంభ దినం కనుక కేరళలో దీనికి 'విశు' అని పేరు. ఇది వసంతఋతువు. ఈ ఋతువు కోసం ప్రాచీన కాలంలో ఋషులు అనేకవిధములైన సత్సంకల్పములతో కాచుకొని ఉండేవారు. ఈ ఋతువులో ప్రకృతి సౌందర్యం కన్నులపండువగా ఉంటుంది. మామిడి పూత, కోకిల కూత మనస్సుకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తాయి. ఈ పవిత్రమైన వసంత కాలములో ఈ దినముననే సిక్కుల గురువైన గురునానక్ తన శిష్యులకు ప్రబోధలు సల్పుట ప్రారంభించాడు, దశరథ మహారాజు అశ్వమేధ యాగమునకు, పుత్రకామేష్టి యాగమునకు అంకురార్పణ గావించాడు. అశ్వమేధయాగములో ఈ వసంత ఋతువునందే అశ్వమును వదలటం జరుగుతుంది. ఈ అశ్వము ప్రపంచమంతా చుట్టి తిరిగి వసంత ఋతువునందే ఇంటికి చేరుకుంటుంది. వసంతఋతువు మహాకల్యాణకరమైనది, మంగళ కరమైనది, శుభప్రదమైనది.

ఈశ్వరనామ సంవత్సరమునకు ఈనాడు మనం స్వాగతం చెబుతున్నాము. సకలైశ్వర్య స్వరూపుడే ఈశ్వరుడు. జ్ఞానము, ధనము, విద్య, బలము - ఇవన్నీ ఐశ్వర్యములే. అయితే కేవలం ప్రాకృతమైన ఐశ్వర్యమును మాత్రమే కాదు, జ్ఞానైశ్వర్యమును మనం అభివృద్ధి పర్చుకోవాలి. జ్ఞానైశ్వర్యముతోపాటు గుణైశ్వర్యమును కూడా పెంచుకోవాలి. యుగాదిని ఒక్కొక్క ప్రాంతము వారు ఒక్కొక్కరీతిగా అనుభవిస్తూ ఆనందిస్తూ వస్తున్నారు. బీహార్ రాష్ట్ర ప్రజలు ఈ యుగాదిని సూర్యనమస్కారములచేతను, సూర్యారాధన చేతను ప్రారంభిస్తారు. యుగాది రెండు విధములు. ఒకటి సూర్యమాసమునకు సంబంధించినది, రెండవది చంద్రమాసమునకు సంబంధించినది. గడచిన యుగాది చంద్రమాసమునకు సంబంధించినది. ఈనాటి యుగాది సూర్యమాసమునకు సంబంధించినది. వేదము, ''చంద్రమా మనసో జాతః'' అన్నది. మనస్సు యొక్క ప్రతిబింబమే చంద్రుడు. చంద్రుని వెన్నెల హృదయానికి చల్లదనము నందిస్తుంది. సూర్యప్రకాశము

అజ్ఞానాంధకారమును పోగొట్టి సుజ్ఞానమును చేకూర్చుతుంది. కనుకనే కొన్నికొన్ని ప్రాంతముల వారు కాలమునకు సూర్యమాసము, చంద్ర మాసము అనే ప్రత్యేకమైన పేర్లు నిర్ణయించు కున్నారు.

***పర్వదినముల పరమార్థం :*** యుగములు గడచినవి, జగములు కదలినవి. కాని మనిషి మనస్సు ఇంకను మారలేదు. ఇంక యుగాది పండుగను జరుపుకోవడంవల్ల ప్రయోజన మేమిటి? ఈ పవిత్రమైన దినమున మన హృదయం కూడా పవిత్రమైనదిగా మారుతున్నదా? లేదు. లౌకికమైన చర్యలయందు మాత్రమే మన మనస్సును లగ్నం చేస్తున్నాము. పర్వదినములన్నీ పరమాత్మ నిమిత్తమై ఏర్పడినవేకాని పాయసపరమాన్నములు చేసుకునే నిమిత్తం కాదు. పర్వదినములయందున్న మహత్తరమైన రహస్యాన్ని మనం గుర్తించడానికి ప్రయత్నించాలి. ఎన్ని పర్వదినములను చూశామో, ఇంకెన్ని పర్వదినములను చూడబోతామో! కాని మనయందు మాత్రం కించిత్తైనా మార్పు కనిపించడం లేదు. మనిషికి అంతరాత్మకు, మనిషికి ప్రపంచానికి మధ్యగల సంబంధ బాంధవ్యాన్ని గుర్తించాలి. అంతర్ముఖమైన భావంతో అన్నింటియందు ఏకత్వాన్ని దర్శించాలి. ఇది లేకుండా పర్వదినములను జరుపుకోవడంవల్ల ప్రయోజనం శూన్యం.

***మానవజన్మ విశిష్టత :*** మానవుడు మనుసంతతికి చెందినవాడు. మను - జ. అనగా, మనువు నుండి పుట్టినవాడు మానవుడు. మనువు మహాచక్రవర్తి, ధర్మమూర్తి. ఈనాటి న్యాయశాస్త్రముకాని, ధర్మ శాస్త్రముకాని మనుచక్రవర్తి బోధించినటువంటివే. అట్టి మనువు నుండి పుట్టిన మానవులలో ఈనాడు న్యాయము, ధర్మము ఎక్కడికి పోయినాయి? తండ్రి యొక్క ఆస్తి పుత్రులకు రావాలి కదా! కాని మనువు యొక్క గుణములలో వేయింట ఒక భాగమైనా ఈనాటి మనుష్యులలో కనిపించడం లేదు. మనుష్యులుగా జన్మించి పశువులుగా జీవించడం మంచిది కాదు. పశువులూ తింటున్నాయి, మనుష్యులూ తింటున్నారు ; పశువులూ నిద్రిస్తున్నాయి, మనుష్యులూ నిద్రిస్తున్నారు ; పశువులకూ ఆలుబిడ్డలుంటున్నాయి, మనుష్యులకూ ఆలుబిడ్డ లుంటున్నారు. ఇంక మనుష్యులకు, పశువులకు మధ్యనున్న వ్యత్యాస మేమిటి? ''జంతూనాం నరజన్మ దుర్లభం'' అని చెప్పడంలో అర్థమేమిటి? మొట్టమొదట మానవత్వం యొక్క విశిష్టతను గుర్తించడానికి ప్రయత్నించాలి. ఎందుకోసం పుట్టాము? ఏమి చేస్తున్నాము? ఎక్కడికి పోతున్నాము? ఎక్కడి నుండి వచ్చామో, ఎక్కడికి వెళతామో రెండూ మనకు తెలియటం లేదు. రిజిస్టర్డ్ కవర్‌పైన From అడ్రస్సు అయినా ఉండాలి, To అడ్రస్సు అయినా ఉండాలి. ఈ రెండూ లేకపోతే దానిని వేస్ట్‌పేపర్ బాస్కెట్‌లో పడవేస్తారు. ఈనాడు మానవుని బ్రతుకుకు From అడ్రస్సు కనపడటం లేదు, To అడ్రస్సు కూడా కనపడటం లేదు. అనగా, ఎక్కడి నుండి వచ్చామనే From అడ్రస్సు ఎవ్వరికీ తెలియదు, ఎక్కడికి వెళతామనే To అడ్రస్సు కూడా తెలియదు. కనుకనే జీవితం వ్యర్థమై పోతున్నది.

***కలియుగ కబంధులు :*** ప్రతి ఒక్కరు తమ స్వార్థ స్వప్రయోజనముల నిమిత్తమై బ్రతుకుతున్నారేగాని సమాజము గురించి, దేశము గురించి ఎవ్వరూ విచారించడం లేదు. ఈనాటి మనుష్యులు ఒకరి కొకరు ఏమాత్రము సంబంధము లేకుండా సంచరిస్తున్నారు. ఎక్కడైనా మీరు బజారులో

చూడండి - ఏమాత్రము విశ్రాంతి లేకుండా అనేక మంది అటూ ఇటూ తిరుగుతూ కనిపిస్తారు. ఒక్క క్షణమైనా రోడ్డు ఖాళీగా ఉండదు. ఎక్కడికని తిరుగుతున్నారు? ఎందుకని తిరుగుతున్నారు? ఏమి సాధిస్తున్నారు? ఏమీ లేదు! నిన్న తిన్న కడుపుకే ఈనాడూ తింటున్నారు, నిన్న కడిగిన మొహాన్నే ఈనాడూ కడుగుతున్నారు. ఈవిధంగా తినటం, కడగటం... తినటం, కడగటం ఎంతకాలమని? ఎన్ని మూటల బియ్యం తిన్నారో, ఇంకెన్ని మూటల బియ్యం తింటారో! తినటం, తిరగటంలోనే కాలం వ్యర్థమైపోతున్నది. తినటంకోసమే పుట్టామా మనం?

రామాయణంలో ఒక విచిత్రమైన వ్యక్తి ఉన్నాడు. అతని పేరే కబంధుడు. అతని తల భుజములపై లేదు, పొట్టపై ఉన్నది. అతని హస్తములు చాల పొడవైనవి. వాటి సహాయంతో ఆహారాన్ని సేకరించి భుజించడమే అతని పని. ఈనాడు ప్రైమ్‌మినిస్టర్ మొదలుకొని భిక్షగాని వరకు అందరూ పొట్టకోసమే పాటుపడుతున్నారు. ఇంక ప్రైమ్‌మినిస్టర్‌కు, భిక్షగానికి మధ్యగల వ్యత్యాస మేమిటి? భిక్షగాడు తన పొట్టకోసం పాటుపడతాడు. ప్రైమ్‌మినిస్టర్ ప్రపంచంకోసం పాటుపడాలి. వ్యష్టి జీవితాన్ని గడుపుతాడు భిక్షగాడు, సమిష్టి జీవితాన్ని గడపాలి అధికారి. ప్రేమస్వరూపులారా! మన జీవితం సమిష్టి జీవితమేకాని, వ్యష్టి జీవితం కాదు. 'నేను, నావారు' అనే సంకుచితమైన భావనలో మునిగిపోకూడదు. అందరూ ఒక్కటే. కలసి మెలసి పెరుగుదాం, కలసి మెలసి తిరుగుదాం. కలసి మెలసి తెలుసుకొన్న తెలివిని పోషించుదాం, కలసి మెలసి కలత లేక చెలిమితో జీవించుదాం. ఐకమత్యమే మానవ జీవితం. ఆచరణే దీని అభివృద్ధికి మూలకారణం.

*నిజమైన భక్తుని లక్షణం:* ఈనాడు ఐకమత్యము లేదు, ఆచరణ లేదు. కాని అందరూ భక్తులమనే చెప్పుకుంటున్నారు. ఏమిటో ఈ భక్తిగాని నాకే మాత్రము అర్థం కావటం లేదు. భక్తి అంటే ఏమను కుంటున్నారు? ఒక చిన్న ఉదాహరణ: తుమ్మెదలు పుష్పముపైననే వ్రాలుతాయి, అందులోని మకరందాన్ని గ్రోలుతాయి. ఇంకొక ప్రదేశానికి ఏమాత్రము వెళ్ళవు. ఇది తుమ్మెదల యొక్క సంస్కారము. వాటి నియమనిష్ఠలు ఈవిధంగా ఉంటాయి. కాని ఈగలకు, దోమలకు మాత్రం ఒక నియమమే లేదు. ఒక నిమిషంలో లడ్డులపైన వ్రాలుతాయి, మరొక నిమిషంలో అశుద్ధముపైన వ్రాలుతాయి. ఒక నిమిషంలో పూలపైన వ్రాలుతాయి, మరొక నిమిషంలో మున్సిపాలిటీవారి బండిపైన వ్రాలుతాయి. ఈవిధంగా ప్రవర్తించేవారు ఈగలు, దోమలవంటివారు. నిజమైన భక్తుడు ఒక్క మార్గమునే అనుసరిస్తాడు. కాని ఈనాడు కొందరు భక్తులమని చెప్పుకుంటూ ఈనాడొక స్వామివద్దకు, రేపు మరొక స్వామివద్దకు, ఎల్లుండి ఇంకొక స్వామివద్దకు - ఈవిధంగా ఈగలమాదిరి, దోమలమాదిరి తిరుగుతున్నారు. ఇలాంటి భక్తులు మహామూర్ఖులు. ఏదో ఒక్క మార్గమును మీరు అనుసరించాలి. ఏది మీకు ఇష్టమో దానిని పట్టుకోండి. కాని మధ్యమధ్యలో ఊరికే మార్చుకోకూడదు. ఈనాటి భక్తులంతా స్వార్థం కోసం ప్రాకులాడుతున్నారు. అక్కడికి పోతే ఏమి చిక్కుతుందో, ఇక్కడికి వెళితే ఏమి చిక్కుతుందో అని అన్నిచోట్లకు తిరుగుతున్నారు. ఈ చిక్కిన వాటిని ఏదో ఒకనాడు వదలిపెట్టి పోవలసిందే కదా! మీరు పొందవలసింది భగవంతుని ప్రేమయే. దానిని మించినది మరొకటి లేదు. కాని దానిని విస్మరించి, ఇతని దగ్గరకు పోతే ఏమి లభిస్తుందో,

అతని దగ్గరకు పోతే ఏమి లభిస్తుందో అనే తుచ్ఛమైన వ్యాపార ధోరణిలో మునిగిపోతున్నారు. ఇది కాదు భక్తుని లక్షణం. తుమ్మెదవలె డైరెక్ట్‌గా పుష్పముపైననే వ్రాలి మకరందాన్ని గ్రోలాలి.

ఒకానొక సమయంలో ఒక వ్యక్తి తన రెండెకరాల భూమిలో ఒకచోట బావిని త్రవ్వడానికి ప్రయత్నించాడు. 20 అడుగులు త్రవ్విన తరువాత క్రింద రాయి వచ్చింది. దానిని వదలిపెట్టి ఆ రెండెకరాల భూమిలోనే మరొక చోట త్రవ్వడం ప్రారంభించాడు. అక్కడ 10 అడుగులు త్రవ్వేసరికి బండ వచ్చింది. ఈవిధంగా అనేక పర్యాయములు ప్రయత్నించగా చివరికి ఒక చోట 5 అడుగులకే నీరు వచ్చింది. ''ఆహా! అక్కడ 20 అడుగులు త్రవ్వినా నీరు రాలేదు. మరొకచోట 10 అడుగులు త్రవ్వినా నీరు రాలేదు. కాని ఇప్పుడు 5 అడుగులు త్రవ్వేసరికే నీరు వచ్చింది'' అని ఆనందించాడట! 5 అడుగులకే నీరు వచ్చిందని మాత్రమే తాను చూస్తున్నాడుకాని, తన రెండెకరాల భూమి అంతా గుంతలు పడిపోయిన సంగతి తాను గమనించటం లేదు. ఈనాటి భక్తులు కూడా అంతే! ఒకరి దగ్గరికి పోయి కొంతకాల ముంటారు, మరొకరి దగ్గరికి పోయి కొంతకాల ముంటారు, ఇంకొకరి దగ్గరికి పోయి కొంతకాల ముంటారు. ఈవిధంగా అటు పోయి, ఇటు పోయి కట్టకడపటికి హృదయాన్ని ముక్కలు ముక్కలుగా చేసుకుంటున్నారు.

***ఆధ్యాత్మిక గైడ్‌పోస్ట్‌లు :*** ఈనాడు అనేకమంది వేదము, భగవద్గీత, బైబిల్, ఖురాన్ మున్నగు సద్గ్రంథములను పారాయణ చేస్తున్నారు. కాని భగవంతుడు వేదములో లేడు, భగవద్గీతలో లేడు, బైబిల్‌లో లేడు. ఇవన్నీ భగవంతుని చేరే మార్గం చూపించే గైడ్‌పోస్ట్‌ల వంటివి. ఇవి చూపించే మార్గము ననుసరించి గమ్యం చేరవలసింది నీవే. నీవు వైట్‌ఫీల్డ్ నుండి బెంగుళూరుకు వెళ్ళాలనుకున్నావు. ఏ దిశగా వెళ్ళితే బెంగుళూరు చేరవచ్చునో గైడ్‌పోస్ట్ చూపుతుందికాని ఆ రోడ్డుపై పోయి కూర్చుంటే అదేమైనా నిన్ను బెంగుళూరుకు చేర్చుతుందా? లేదు. నీవు నడచి వెళ్ళాలి, అప్పుడే బెంగుళూరు చేరగలవు. అదేరీతిగా నిత్యసత్యమైన తత్వాన్ని పొందాలంటే నీవు నిర్గుణునిగా ఉండాలని వేదములు చెప్పాయి. ఆడంబరాలను త్యజించాలి, ఆజ్ఞను శిరసావహించాలి, చిత్తమును శుద్ధి చేసుకోవాలి. అప్పుడే భగవంతుడు నీకు సాక్షాత్కరిస్తాడు. అంతేగాని అనవసరంగా ఏవేవో శ్రమలు పడి, భగవంతుడు నన్నింకా అనుగ్రహించ లేదే అని బాధపడితే ప్రయోజనం లేదు.

***ఆచరణే ప్రధానం :*** 'నేను గొప్ప విద్యావంతుడను' అని నీవు విఱ్ఱవీగుతావేమో! కాని నీ విద్య ఎక్కడి నుండి వచ్చింది? అది భగవంతుని అనుగ్రహ ప్రసాదమే. భగవంతుడు నీకంటే ఎక్కువగానే చదువుకున్నాడు. నీవు నాల్గు పేజీలు చదివితే భగవంతుడు నలభై పేజీలు చదువుకున్నాడు. అయితే నీ చదువును నీవు ఆచరణలో పెట్టాలి. రాముడు చదివిన చదువును రావణుడు కూడా చదివాడు. అయితే రాముడు తాను చదివిన చదువును ఆచరణలో పెట్టి జీర్ణించుకున్నాడు. అందువల్లనే తాను దేవుడైనాడు. కాని రావణుడు తన చదువును తాను ఆచరణలో పెట్టకపోవడంవల్ల 'అజీర్ణవ్యాధి' కి గురియైనాడు. అందువల్లనే అతనికి అహంకారము, కామము, మోహము ఇత్యాది రోగములు ప్రారంభమైనాయి. కనుక మీ భక్తిని మీరు ఆచరణలో చూపించాలికాని కేవలం మాటలలోను, ఉపన్యాసములలోను, గ్రంథపఠనంలోను కాదు.

**కృష్ణతులాభారం :** సత్యభామ ఎన్ని విలువైన నగలు పెట్టినా కృష్ణుడు తూగలేదు. దీనిని భక్తులు చక్కగా గుర్తించాలి. గొప్పగొప్ప నగలను, వజ్రవైఢూర్య మరకత మాణిక్య గోమేధిక పుష్యరాగముల నెన్నింటినో తెచ్చి వేసిందికాని, త్రాసు కించిత్తైనా కదల లేదు. చివరికి రుక్మిణి వచ్చి, "*పత్రమో పుష్పమో ఫలమో తోయమో, భక్తి కల్గిన వారికి వశుడవగుట సత్యమేని కృష్ణా! నీవీ తులసీ దళమునకు తూగుదువు గాక!*" అని ప్రార్థించి త్రాసులో ఒక తులసీదళమును వేసింది. కృష్ణరూపానికి కృష్ణనామమే సరియైన తూకము. రుక్మిణి 'కృష్ణా!' అని హృదయపూర్వకంగా స్మరించి తులసీదళమును వేసే సరికి అది Extra Weight అయింది. దానితో కృష్ణుడు కూర్చున్న పళ్ళెము ఒక్కసారిగా పైకి లేచింది. అనగా భగవంతుడు పవిత్రమైన ప్రేమతత్వానికి మాత్రమే తూగుతాడుకాని ఇంక దేనికీ తూగడు. ఎంత పూజ చేశావు? ఎంత దానం చేశావు? అనేది ఏమాత్రము చూడడు. దానము చేయడానికి నీవెవరు? ఎక్కడి నుండి తెచ్చావు నీ ధనమును? అంతా భగవంతుడిచ్చినదే!

**భగవంతునికి నవ్వు గొల్పే సన్నివేశాలు :** ప్రాపంచిక విషయాలకు సంబంధించి భగవంతుడు రెండుతూర్లు నవ్వుకుంటాడట. ఎప్పుడు? హాస్పిటల్‌లో చేరిన పేషంట్‌తో డాక్టరు, "నీకేమీ భయం లేదు. నేనున్నానుగా, నేను చూసుకుంటాను" అన్నప్పుడు - "వీడా చూసుకునేది! ఆ పేషంట్‌కు ప్రాణ మివ్వగలడా వీడు? ఎంత పిచ్చివాడు!" అని నవ్వుకుంటాడట. ఇంక రెండవతూరి నవ్వుకునేది ఎప్పుడు? "ఇదిగో, కావలసినంత తినండి, నేను పెడతాను. నేను దానమిస్తాను" అని ఎవ్వరైనా గొప్పలు చెప్పుకున్నప్పుడు, "వీడా దానమిచ్చేది!" అని నవ్వుకుంటాడట. మనకు భగవంతుడు ఇస్తేనే కదా మనం ఇతరులకు ఇవ్వగల్గుతున్నాము. అన్నీ భగవంతుడు ఇచ్చినవే. కనుక భగవంతుడు ఇచ్చిన దానిని భగవంతునికే ఇవ్వడానికి సంకోచ మెందుకు!

**మాణిక్యవాచికార్ వృత్తాంతం :** ఇటీవల మద్రాసులో మాణిక్యవాచికార్ కథ చెప్పాను. అతడు చిన్న వయస్సులోనే పాండ్యరాజు వద్ద మంత్రిగా పని చేసే వాడు. అతనికి వివాహము లేదు, నిరంతరము దైవచింతన తప్ప అన్యచింతలు లేవు. పాండ్యరాజుకు గుఱ్ఱములపై మక్కువ ఎక్కువ. ఒకనాడు అతడు మాణిక్యవాచికార్‌కు కొంత ధనము నిచ్చి, పరివారము నిచ్చి మంచి గుఱ్ఱములను కొని తీసుకురమ్మని పంపించాడు. మార్గమధ్యంలో శిథిలా వస్థలో నున్న ఒక శివాలయం కనిపించింది. దాని ప్రక్కనే శివయోగి మఠం ఉన్నది. మాణిక్యవాచికార్ శివయోగి ప్రబోధలచేత ప్రభావితుడై అతని శిష్యునిగా మారిపోయాడు. గుఱ్ఱములను కొనడాని కని రాజు ఇచ్చిన ధనముతో శివాలయాన్ని పునరుద్ధరించాడు.

*"బ్రహ్మాండ మంతయు ప్రబలు చుండెడి నీకు*
*ఆలయంబు నమర్చ అలవి యగునా?*
*కోటి సూర్యుల కాంతి మేటి కల్గిన నీకు*
*ప్రమిద దీపము నెవరు పట్టగలరు?*
*అజహరాదులకైన అందనివాడవు*
*నీ రూపు కనుగొన నెవరి తరము?*
*సర్వజలములయందు సంచరించెడి నీకు*
*స్నానంబు చేయింప సాధ్యమగునా?*
*బ్రహ్మాండ మంతయు బొజ్జలో నున్న నీకు*
*భక్ష్యభోజ్యములు పెట్ట తగునా?"*

అని వర్ణిస్తూ ఆ ఆనందములోనే లీనమైపోయాడు.

ఈ వార్త రాజుకు తెలిసింది. వెంటనే అతడు మాణిక్యవాచికార్‌ను పిలిపించి, ''గుఱ్ఱాలను కొనమని డబ్బు నిస్తే దానితో దేవాలయాన్ని నిర్మించి అభిషేకాలు చేస్తూ కూర్చుంటావా!'' అని నిలదీసాడు. ''రాజా! గుఱ్ఱాలవల్ల వచ్చే ఫలిత మేమిటి? దేవుడే నాకు ముఖ్యం. అంతా దేవునిదే, అంతా దేవుడిచ్చినదే. నీది కాదు, నాది కాదు. కనుక దేవుడిచ్చినది తిరిగి దేవునికే ఇచ్చాను'' అని పలికేటప్పటికి రాజు అతనిని జైల్లో పెట్టించాడు. కాని అతడేమీ బాధపడలేదు. ''భగవంతుడా! నాకెంత ఉపకారం చేశావు! ఈ లౌకికమైన ప్రపంచంలో మునిగి, లౌకికమైన విషయాలను విని, లౌకికమైన దృశ్యాలను చూసి నా హృదయమంతా మాలిన్యమైపోయింది. కనుకనే నన్ను విశ్రాంతి తీసుకొమ్మని ఈ చెఱసాలలో పెట్టావు. కృష్ణా! నీ జన్మస్థానములో నన్ను చేర్చుకున్నందులకు కృతజ్ఞుడను'' అని ఎంతగానో ఆనందించాడు. చెఱసాలలో ఉండగానే కృష్ణుని వర్ణిస్తూ అనేక శ్లోకాలు రచించాడు. వాటికే 'తిరువాచికమ్' అని పేరు వచ్చింది. తమిళప్రజలకు ఈ తిరువాచికమ్ వేదంతో సమానం. ఎందుచేత? చిత్తశుద్ధితో మాణిక్యవాచికార్ రచించాడు గనుక. మాణిక్యముల వంటి పదములను దానిలో చేర్చాడు. అతడు పరమ భక్తుడు. ''ఈ ప్రపంచంలో ఎంత కాలమున్నా ఏదో ఒకనాడు దీనిని విడిచిపెట్టక తప్పదు. కనుక ఈ ప్రపంచంతో నాకు అవసరం లేదు. రాకపోకలు లేని శాశ్వతమైన నీ సన్నిధి నాకు కావాలి'' అని భగవంతుని ప్రార్థించేవాడు. అదే నిజమైన భక్తి. దానిలో అణుమాత్రమైనా మనం సాధించడానికి ప్రయత్నించాలి. మన ఇంద్రియాలు నిరంతరము లౌకిక విషయాలలో మునిగి ఉండటంవల్ల చిత్తము మాలిన్య మవుతున్నది. ఇంద్రియములే దుఃఖానికి కారణము లవుతున్నవి. నీవు ఇక్కడున్నావు. నీ ఇంద్రియాలు ఇక్కడున్నాయి. మద్రాసులో నీవారెవరికో ప్రమాదం సంభవించింది. ఆ వార్త ఫోను ద్వారా నీ చెవికి సోకేసరికి గట్టిగా ఏడ్వటం ప్రారంభించావు. అనగా సమస్త దుఃఖములూ ఇంద్రియాలచేతనే ప్రారంభమవుతున్నాయి. కనుక ఇంద్రియాలను అరికట్టుకోవడానికి ప్రయత్నించాలి. ''ఛీ, నేను వినవలసినవి, చూడవలసినవి లౌకిక విషయాలు కాదు. వాటివల్ల నా మనస్సు మాలిన్య మవుతున్నది. నేను పవిత్రమైన విషయాలను వినాలి, భగవత్స్వరూపాన్ని చూడాలి'' అనే భావం మనలో ఆవిర్భవించాలి. అప్పుడే మనం లౌకికంగాను, ఆధ్యాత్మికంగాను ఉన్నత స్థాయికి చేరుకుంటాము.

''హరేరామా హరేరామా రామరామా హరేహరే
హరేకృష్ణా హరేకృష్ణా కృష్ణకృష్ణా హరేహరే
సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తిః!''

[తేది: **14.4.97**న తమిళ సంవత్సరాది మరియు మళయాళ సంవత్సరాది 'విషు' సందర్భంగా సాయిరమేశ్‌హాల్ (బృందావనం)లో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి]

*ప్రేమ అనే ఖడ్గాన్ని వివేకమనే ఒరలో ఉంచాలి. ప్రేమ కత్తి లేకుండా పరిపాలిస్తుంది, చట్టం లేకుండా బంధిస్తుంది. ప్రేమను పంచుకున్నంత కాలము అది పెరుగుతూనే ఉంటుంది. -బాబా*

# సత్యోపనిషత్

(గత సంచిక తరువాయి)

39. స్వామీ! అందరిలోను ఒకే దివ్యత్వమున్నప్పుడు మాలో వ్యత్యాసాలు ఎలా ఉన్నాయి?

*బాబా:* దివ్యత్వం ఎప్పుడూ ఒక్కటే, రెండవది లేదు. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ." అయితే మానవులలో ఇంత వైవిధ్యం ఎలా ఏర్పడింది? అని అడిగావు. దీనికి ఒక ఉదాహరణ: కరెంటు ఒక్కటే, దీనిలో తేడా లేదు. కాని తక్కువ వోల్టేజిగల బల్బులు తక్కువ ప్రకాశాన్ని అందిస్తాయి, ఎక్కువ వోల్టేజి గల బల్బులు ఎక్కువ వెలుతురు నిస్తాయి. అదేవిధంగా మన దేహమే బల్బు, మనస్సే వోల్టేజి. దీనిలో గల వ్యత్యాసమే ఈ వైవిధ్యానికి కారణమైందిగాని దైవత్వమనే కరెంటు ఎప్పటికీ ఒక్కటే.

40. దివ్యత్వం అందరిలోను ఉన్నదన్నారు కదా! మరి పుట్టుక పూర్వం ఈ దివ్యత్వం ఎక్కడుంది? మరణానంతరం కూడా ఈ దివ్యత్వం ఉంటుందా స్వామీ? ఉంటే ఎలాగ ఉంటుంది?

*బాబా:* దివ్యత్వం ఎప్పుడూ ఉన్నదే. అది రాకపోకలు లేనిది. దానికి జననమరణాలు లేవు. అయితే ఇప్పుడు నీ ప్రశ్న ఏమిటి? పుట్టుక పూర్వం అది ఎక్కడుంది? మరణానంతరం ఏమవుతుంది? అనే కదా! దీనికి ఒక చిన్న ఉదాహరణ: కరెంటు ఉన్నది, అది వైరు గుండా ప్రసరిస్తున్నది. వైరుకు బల్బు పెట్టుకోవడానికి హోల్డరు కూడా బిగించబడి యున్నది. ఇప్పుడు నీవు హోల్డరుకు బల్బును తగిలించావనుకో, వెలుతురు వస్తుంది. అంటే వైరులో ఇంతకు పూర్వమే ఉన్న కరెంటు ఇప్పుడు నీవు బిగించిన బల్బులో చేరి వెలుతురు నిచ్చింది. అంతేగాని క్రొత్తగా ఎక్కడి నుండో కరెంటు రాలేదు. అది వైరులో ప్రసరిస్తూనే ఉంది. దానిని బల్బు ద్వారా గుర్తించావు. ఇప్పుడా బల్బును తీసివేశావనుకో, కరెంటు ఎక్కడికీ పోదు, అక్కడే ఉంటుంది. అయితే బల్బు పెడితే వెలిగింది, తీసివేస్తే వెలుతురు లేదు. అదేవిధంగా దేహం ఒక బల్బు వంటిది. ఇది పుట్టుక పూర్వం, మరణానంతరం, మరి మధ్యకాలంలోను ఉన్నది కరెంటు సమానమైన దివ్యత్వమే.

41. ఇన్ని విలువైన విషయాల నెన్ని గ్రహిస్తే మేము సాధనలో ప్రవేశించగల్గుతాము స్వామీ? ఎన్ని గ్రంథాలలోని విషయాలను మేము తెల్సుకోవాలి?

బాబా: ఎన్నో అక్కర్లేదు. చాలమంది అనేక గ్రంథాలను చదువుతున్నారు, ఎన్నో సంవత్సరాల నుండి ఉపన్యాసాలను వింటూనే ఉన్నారు. కాని ఏమి ప్రయోజనం? ఎక్కడి వారక్కడే ఉన్నారు. దీనికి కారణం ఆచరణ లోపమే. అసలు ఇన్ని గ్రంథాలను చదువనక్కర లేదు. ఏదైనా ఒక్కటి బాగా గ్రహించి ఆచరిస్తే తరించవచ్చు. ఇతరులను చంపాలంటే ఒక కత్తో, పిస్తోలో, తుపాకీయో కావలసివస్తాయికాని, ఆత్మహత్య చేసుకోవాలంటే ఒక చిన్న పిన్నో, లేక సూదియో చాలు. అలాగే ఇతరులకు బోధించడానికి చాల గ్రంథాలు చదవాలి. ఎన్నో విషయాలు తెలియాలికాని నిన్ను నీవు ఉద్ధరించుకోవడానికి, తరించడానికి ఒక్కటి చాలు. తెలిసిన మంచిమాట ఒక్కటైనా ఆచరించడం మేలు! చాలు!

**42.** త్రిమతాచార్యుల ద్వైత విశిష్టాద్వైత అద్వైత సిద్ధాంతములు పరస్పర విరుద్ధమైన ఆధ్యాత్మిక మార్గము లంటారా?

బాబా: ఇది సాధారణంగా అందరూ భావించేది. కాని ఇది నిజం కాదు. ఈ మూడింటినీ ఒకదానితో ఒకటి సమన్వయం గావించవచ్చును. ఉదాహరణకి చెఱకును తీసుకుందాము. చెఱకుగడ రసముతో కూడియున్నది. ఇది ద్వైతము. ఈ చెఱకును పిప్పి చేసి రసమును తీయవచ్చును. ఈవిధంగా చెఱకురసము పిప్పి నుండి వేరు చేయబడిన స్థితిని విశిష్టా ద్వైత మనవచ్చును. కాని ఈ చెఱకు రసము ఎక్కువ కాలము నిలువ ఉండదు. దీనిని వివిధ ప్రక్రియల ద్వారా పంచదారగా చేసి శాశ్వత స్థితిని కల్పించి వినియోగించు కోవచ్చును. ఈ స్థాయిని 'అద్వైతము' అనవచ్చును. చక్కెరను ఎందులో కలుపుతున్నా అది తీయగానే ఉంటుంది.

**43.** మాయ అనేది ఏమిటి స్వామీ? దయచేసి దానిని వివరించండి.

బాబా: మాయ అనేది లేదు. ఉన్నది బ్రహ్మమే. మాయ నీ భ్రమ తప్ప మరొకటి కాదు. దేహభావమే మాయ, అనాత్మ భావమే మాయ. నీవు కాని దానిని నీవనుకుంటున్నావు. ఇదే మాయ. నిజానికి మాయ అనేది లేదు. అంతా నీ భ్రమనే! ఒక ఉదాహరణ: సూర్యుని వెలుతురు వృక్షముపై పడినప్పుడు దాని క్రింద నీడను చూడగల్గుతున్నాము. ఇందులో గమనించవలసిన ముఖ్యమైన విషయం ఒకటుంది. ఏమిటది? సూర్యుని వెలుతురులో నీడ లేదు, చెట్టుక్రిందనే నీడ ఉన్నది. ఎందుకు? అని విచారణ చేస్తే ఈ చెట్టు కొమ్మలు, రెమ్మలు కలిగియుండటం వలన అని తెలుస్తుంది. ఇక్కడ సూర్యుని వెలుతురు - బ్రహ్మము, వృక్షము - జీవుడు, కొమ్మలు రెమ్మలు - జీవుని యొక్క బంధాలు, కోరికలు. వీటివల్లనే 'నీడ' అనే మాయ ఏర్పడింది. ఇవి లేకపోతే నీడయే లేదు. అనగా మాయే లేదన్నమాట. (సశేషం)



# "రామో విగ్రహవాన్ ధర్మః"

* * * * * * * * * * * * * * * *

*వేదవేద్యుడైన భగవంతుడు దశరథ కుమారునిగా జన్మించి జగత్తునందు శ్రీరామచంద్రుడై వర్ధిల్లుచున్నాడని వాల్మీకి రచించాడు. అతడు సామాన్య మానవునివలె సంచరిస్తున్నాడని కూడా వర్ణించాడు. అట్టి రామునిలో దేవుణ్ణి చూశాడు వాల్మీకి. కాని, రాముణ్ణి మానవునిగా చూశాడు రావణుడు. రాముడు ధర్మము, రావణుడు అధర్మము. కనుక రామాయణమంతయు ధర్మాధర్మముల రణరంగము, ధర్మాధర్మముల చదరంగము.*

రావణుడు ఈ ప్రపంచానికి ఒక చక్కని సందేశాన్ని అందించాడు. ఏమిటది? "ఓ జనులారా! మీరు నావలె జీవించి మీ జీవితాలను నాశనం చేసుకోకండి. ఆశలను జయించలేక, వాంఛలను చంపుకోలేక నా వంశాన్నే నాశనం చేసుకున్నాను. కొడుకులను, సోదరులను, బంధు మిత్రులను చంపుకున్నాను. కడకు నేను కూడా నశించాను" అన్నాడు. మంచినడతతో కూడినప్పుడే మనిషి మంచివాడవుతాడు. రావణుడు తాను గొప్పవాడు కావాలని ప్రయత్నించాడుకాని, మంచి వాడు కావాలని ప్రయత్నించ లేదు. రాముడు మాత్రం తాను మంచివాడు కావాలని ప్రయత్నించాడుకాని, గొప్పవాడు కావాలని ఆశించ లేదు. ఈనాడు లోకమునకు రామచరితము అత్యవసరం. ఎందుకనగా - కొడుకులు తండ్రి ఆజ్ఞను పాటించడం లేదు, తండ్రులు కొడుకులకు సరియైన ఆదర్శాన్ని అందించడం లేదు. శిష్యులు గురువులను గౌరవించడం లేదు, గురువులు శిష్యులను వాత్సల్యంతో చూడటం లేదు. బంధు మిత్రుల మధ్య శత్రుత్వం అభివృద్ధి అవుతున్నది. వ్యవసాయ వ్యాపార రాజకీయ రంగములన్నింటి యందు కాలుష్యము నిండియున్నది. చివరికి ఆధ్యాత్మిక రంగము కూడా కలుషిత మవుతున్నది. చక్కగా విచారణ చేస్తే స్వార్థమే దీనికి మూల కారణమని స్పష్టమవుతున్నది. అందరూ త్రాగే నీరు ఒక్కటే. అందరూ పీల్చే గాలి ఒక్కటే. అందరి తలపైన ఉన్నది ఒకే ఆకాశమే. అందరి పాదముల క్రింద ఉన్నది ఒకే భూమియే. విశ్వమే ఒక గృహము. మానవులందరూ సోదరులే. ఇట్టి ఏకత్వాన్ని మొట్టమొదట గుర్తించాలి.

**హృదయమే అయోధ్య :** వ్యక్తి ధర్మమును, సంఘ ధర్మమును, కుటుంబధర్మమును రాముడు నిరూపిస్తూ వచ్చాడు. ఈ ధర్మత్రయ త్రివేణీ సంగమమే రామచరితము. ఈ త్రివేణీ సంగమము నందు స్నాన మాచరించిన వారికి పాపములు పరిహారమౌతాయి, శాపములు నిర్మూలమౌతాయి. ఈ దివ్యచరితమును ప్రతి మానవుడు స్మరించాలి, వరించాలి, తరించాలి. రాముని చరిత్ర ఇట్టిది, అట్టిది అని వర్ణించుటకు వీలుకానిది. సముద్రములోని తరంగములనైనా లెక్కించవచ్చునుకాని, రాముని గుణగణములను ఎవ్వరూ లెక్కించ లేరు. రాముడు అయోధ్యను పరిపాలించాడు. అయోధ్య అనగా ఏమిటి? యోధులు, విరోధులు చేరరానటువంటి

ప్రదేశము. అదే మానవ హృదయం. అక్కడే రాముడుంటున్నాడు. ఈనాటి మానవహృదయంలో క్షణక్షణమూ ఏదో ఒకవిధమైన ఆవేదనలు ఏర్పడు తున్నాయి. మొట్టమొదట మానవహృదయం అయోధ్యగా మారాలి. నిర్మలమైనదిగా, నిశ్చల మైనదిగా, కలతలు లేనిదిగా ఉండాలి. అప్పుడే రాముడు అందులో ప్రవేశించి సరియైన మార్గాన్ని చూపుతాడు. రాముడు తాను దేవుడైనను సామాన్య మానవునివలె సంచరించాడు. కనుక ఈనాడు సామాన్య మానవుడు రామునివలె సంచరించాలి. అప్పుడే నిజమైన భక్తిప్రపత్తులు అభివృద్ధి కాగలవు.

*రామతత్వం :* పవిత్రమైన రామతత్వములో అనేక రహస్యములు ఇమిడి యున్నవి. కాని ఈ రహస్యములను రాముడు ఎప్పుడూ ఎక్కడా ఎవ్వరికీ బోధించ లేదు. కారణ మేమిటి? ఫలము పక్వమైన తరువాత రాలక తప్పదు. అదేవిధంగా ప్రజల హృదయాలు పరిపక్వమైతేగాని తన బోధ అర్థం కాదనే భావనతో రాముడు సామాన్య మానవునివలె సంచరించాడు. కష్టనష్టములను, నిందానిష్ఠూరములను ధైర్యసాహసములతో ఎదుర్కొని దివ్యత్వాన్ని ప్రకటించాడు. తాను సుఖములకు పొంగలేదు, దుఃఖములకు క్రుంగలేదు. నిందాస్తుతుల పట్ల సమత్వాన్ని వహించాడు. ''సుఖదుఃఖే సమేకృత్వా లాభా లాభౌ జయా జయౌ.'' కాని ఈనాటి భక్తులు సుఖము కల్గితే పొంగిపోతున్నారు, దుఃఖము కల్గితే క్రుంగి పోతున్నారు. దీనికి మూలకారణ మేమిటి? దేహాభిమానమే!

ఈనాడు మనం అనేక సాధనలు చేస్తున్నాము, స్తోత్రములు పఠిస్తున్నాము, కీర్తనలు పాడుతున్నాము. కాని ఇవన్నీ కేవలం బాహ్యమైనవి గానే గోచరిస్తున్నాయి. ఎవరికోసం చేస్తున్నాము? ఎందుకోసం చేస్తున్నాము ? అనే ప్రశ్నలను ఎవరికి వారు వేసుకోవడం లేదు. ఒక గురువువద్ద ఒక శిష్యుడుండేవాడు. ఒకనాడు అతడు ఇంటికి వెళ్ళి, తన సాధనకు ఎట్టి అంతరాయమూ కలుగకూడదనే ఉద్దేశ్యంతో తలుపులు మూసుకొని, గురుస్తోత్రం చేస్తూ కూర్చున్నాడు. అదే సమయానికి గురువు అతని ఇంటికి వెళ్ళాడు. అది మిట్టమధ్యాహ్నం కావడంచేత బయట ఎండ మండిపోతున్నది, క్రింద కాళ్ళు కాలిపోతున్నాయి. దానిని భరించుకోలేక గురువు, ''ఒరేయ్ శిష్యా! శిష్యా!'' అని గట్టిగా పిలుస్తూ తలుపు తట్టాడు. ''ఎవరు మీరు?'' అని ప్రశ్నించాడు శిష్యుడు. ''నేనురా! నీ గురువును'' అన్నాడు. ''నేను పూజ చేస్తున్నాను. దానికి భంగం కలుగకూడదు. కొద్దిసేపు ఆగండి'' అన్నాడు శిష్యుడు. ''ఎవరి పూజ చేస్తున్నావురా?'' అని గురువు ప్రశ్నించగా, ''మీ పూజనే చేస్తున్నాను'' అని జవాబిచ్చాడు. గురుపూజ చేస్తూ గురువునే ఎండలో నిలబెట్టాడు! ఈనాటి సాధనలు కూడా ఈవిధంగానే ఉన్నాయి. గురువును గౌరవించక గురుపూజ చేయడ మెందుకు? అదేరీతిగా హృదయంలో ఉన్న రామతత్వాన్ని గుర్తించక రాముని ఎంత పూజించినా ప్రయోజనం లేదు. ఈ పూజలన్నీ దేహాభిమానంతో కూడినవే. సాధకులు మొట్టమొదట ఆత్మాభిమానులు కావాలి. ఎన్ని జన్మ లెత్తినప్పటికీ దేహములు మారుతుంటాయికాని మనస్సు మారదు. కనుక మనస్సుతో చేసే సాధనలు మనకు ముక్తి నీయలేవు. మనస్సును విస్మరించి ఆత్మను లక్ష్యంగా పెట్టుకొని సాధన చేయాలి. అప్పుడే మానవ జీవితం సార్థక మవుతుంది.

*మిథిలలో రామలక్ష్మణులు :* విశ్వామిత్రుడు తన యాగము పూర్తియైన తరువాత రామలక్ష్మణులను మిథిలాపురమునకు తీసికొని వెళ్ళాడు. మరునాడు శివధనుర్భంగము జరుగవలసి యున్నది. దాని తరువాత ఎలాగూ అయోధ్యకు వెళ్ళవలసి వస్తుంది గనుక లక్ష్మణునికి మొట్టమొదట మిథిలాపుర సౌందర్యమును తిలకించవలెనన్న ఆశ పుట్టింది. తన వాంఛను రామునికి విన్నవించుకున్నాడు. అప్పుడు రాముడు, ''లక్ష్మణా! మనం గురువాజ్ఞకు బద్ధులమై ఉన్నాము. గురువాజ్ఞ లేకుండా మనం ఏదీ చేయడానికి వీల్లేదు'' అన్నాడు. ఇరువురూ విశ్వామిత్రునివద్దకు వెళ్ళి, ''గురూజీ! మేము మిథిలాపురమును చూడాలని ఆశిస్తున్నాము'' అన్నారు. ''రామలక్ష్మణులారా! మీరు ఈ జగత్తును సంరక్షించే నిమిత్తమై, జగత్తును మోహింపజేసే నిమిత్తమై, ప్రజల భ్రమలను నిర్మూలం గావించే నిమిత్తమై జన్మించారు. కనుక మీరు తప్పక మిథిలాపురములో సంచరించి ప్రజలందరినీ పవిత్రులను గావించండి'' అన్నాడు.

గురువాజ్ఞను తీసుకొని రామలక్ష్మణులు మిథిలాపురంలో వీథుల వెంట నడుస్తూ వెళుతుంటే ఎక్కడివారక్కడే నిలచిపోయి రెప్పవాల్చకుండా చూడసాగారు. వీథులలో ఆడుకొంటున్న పిల్లలు పరుగెత్తి వచ్చి రామలక్ష్మణుల చేతులు పట్టుకొని, ''అన్నగారూ! ఎక్కడి నుండి వచ్చారు? ఎప్పుడు వచ్చారు? దయచేసి ఒకసారి మా ఇంటికి రండి'' అని పిలుస్తున్నారు. రామలక్ష్మణులు తలలు వంచుకొని బజారులో పోతుంటే ఒక్కసారి వారి కన్నులను చూడాలని స్త్రీలు తహతహలాడారు. పువ్వులతో కొడితే వారేమైనా తమవైపు చూస్తారేమో నన్న ఆశతో పువ్వులను చల్లారు. కాని ఎవరెంతగా చల్లినప్పటికీ రామలక్ష్మణులు స్త్రీల నెవ్వరినీ చూడలేదు, తలలు వంచుకొని నడుస్తూ వచ్చారు. ఇదే రామభక్తులు చేయవలసిన ప్రధానమైన సాధన. దృష్టిని అరికట్టుకొన్నవానికి సృష్టియే వశమైపోతుంది. రాముడు దృష్టిని అరికట్టుకొన్నవాడు కనుకనే భూజాతయైన సీత అతని వశమై పోయింది. ఇలాంటి పవిత్రమైన సందేశాలు ఎన్నో రామచరిత్రలో మనకు గోచరిస్తాయి.

*దశరథుని స్వప్నం :* ఒకనాటి రాత్రి దశరథునికొక్క కల వచ్చింది. సముద్రంలో నీరంతా ఇంకిపోయినట్లుగా, చంద్రుడు క్రిందపడి ముక్కలు ముక్కలై పోయినట్లుగా, మదపుటేనుగు క్రిందపడి ప్రాణం విడిచినట్లుగా, దానిపైనున్న సింహాసనము క్రింద కూలినట్లుగా అతనికి కనిపించింది. వెంటనే అతడు లేచి కూర్చున్నాడు. ''ఏమిటీ విచిత్రము! నాల్గవ ఝాములో వచ్చిన స్వప్నం నిజమౌతుందంటారు. ఇది నాల్గవ ఝామే కనుక ఈ స్వప్నము యొక్క అంతరార్థ మేమిటో!'' అని తనలో తాను చాల బాధపడుతున్నాడు. పడకపై నుండి క్రిందికి దిగి ప్రక్కనే ఉన్న నిలువుటద్దములో తన ప్రతిబింబాన్ని తాను చూసుకున్నాడు. తలపై అక్కడక్కడ తెల్లవెంట్రుకలు కనిపించాయి. అనగా తనకు వృద్ధాప్యము ప్రారంభమైనదని గుర్తించాడు. ప్రక్కనే ఉన్న జగ్గు నుండి కప్పులోకి నీరు పోసుకోవడానికి ప్రయత్నించగా చేతులు కాస్త అదిరాయి. అంటే ఇంద్రియశక్తి కూడా క్షీణించినదని గమనించాడు. ''ఇంద్రియశక్తి ఉన్నంతవరకు ఈ రాజ్యాన్ని పరిపాలించాను. ఇప్పుడు నా ఇంద్రియశక్తి క్షీణించింది. కనుక, నేనింక రాజ్య పరిపాలన చేయుటకు అనర్హుడను'' అని భావించాడు. వెంటనే తన గురుదేవులను, మంత్రులను పిలిపించాడు.

''నేనింత కాలము ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించాను. ప్రజాభీష్టమే నా అభీష్టమని భావించాను. ఇప్పుడు నా ఇంద్రియశక్తి క్షీణించింది. కనుక నా జ్యేష్ఠపుత్రుడైన రామునికి పట్టాభిషేకం చేయదల్చుకున్నాను'' అన్నాడు. కాని ప్రజలు, మంత్రులు, ''మహారాజా! మీకింకా రాజ్యపాలన చేయగల శక్తి ఉన్నది. కనుక మీరే ఇంకా కొంతకాలం పరిపాలిస్తే బాగుంటుంది'' అన్నారు. ఈ మాటలు విని దశరథుడు రామునికి పట్టాభిషేకం చేయడం వీరెవ్వరికీ ఇష్టం లేదేమో అనుకున్నాడు పాపం! మంత్రులు వెంటనే, ''మహారాజా! రాముడు మహాగుణవంతుడే. కాని మీకున్న అనుభవం అతనికి లేదు కదా! ముందు రాముని యువరాజుగా చేసి రాజ్యపాలనలో అతనికి మార్గదర్శకత్వం వహించండి'' అన్నారు. చూశారా! ఇంద్రియ పటుత్వం లేనివాడు రాజ్యపాలనకు అర్హుడు కాడన్నాడు దశరథుడు. కాని ఈనాటి నాయకులు కన్నులు కనిపించకపోయినా, చెవులు వినిపించకపోయినా, చేతితో సంతకం చేయడానికి వీలుకాకపోయినా ఇంకా రాజ్యం ఏలాలని ఆశిస్తున్నారు.

***లవకుశులు:*** రాముడు అయోధ్యను పరిపాలిస్తున్న రోజులలో వాల్మీకి రామాయణమును రచించాడు. దానిని ప్రపంచానికి చాటి, ప్రజల హృదయాలలో నాటి వారిని పవిత్రులను గావించాలని సంకల్పించు కున్నాడు. రామచరితము పద్యరూపంలోను, గద్యరూపంలోను, గేయరూపంలోను అన్ని విధాలుగా హృదయాన్ని ఆకర్షిస్తుంది. ఇందులోని శ్లోకాలు శోకనివారణ గావిస్తాయి. ఇట్టి పవిత్రమైన రామాయణాన్ని ప్రజలలో ఏరీతిగా ప్రచారం చేయాలని వాల్మీకి యోచిస్తూ కూర్చున్న సమయంలో ఋషివేషధారులు, మధురగాయకులు అయిన కుశలవులు వచ్చి నమస్కరించి నిలిచారు. వీరు జంటపకులు. వీరి శక్తిసామర్థ్యములను వర్ణించుటకు వీలుకాదు. ఎవ్వరికీ వెఱువరు, వెనుకంజవేయరు. బిడియమనేది వీరియందు లేనే లేదు. వాల్మీకి వీరిరువురినీ చూసి, ''లవకుశులారా! నేను ఎంతో శ్రమించి నిండు హృదయంతో, పవిత్రమైన భావంతో ఈ రామాయణమును వ్రాశాను. దీనిని మీరు ప్రపంచమునకు చాటాలి'' అని ఆదేశించాడు. లవకుశులు అత్యంత వినయంతో నమస్కరించి, ''గురూజీ! మాకు సెలవివ్వండి. మేము గ్రామగ్రామమూ, వీథివీథీ తిరిగి ప్రచారం చేస్తాము'' అన్నారు. ఒకానొక ప్రదేశంలో ఋషు లందరూ సమావేశమై యుండగా ఈ లవకుశులు వారి మధ్యకు వెళ్ళి కమ్మని కంఠంతో పవిత్రమైన రామకథను గానం చేయగా ఋషులందరూ ముగ్ధులై ఆనందబాష్పములు రాల్చారు. లవకుశులను హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తూ రామాయణమును ప్రపంచ మంతటా ప్రచారం చేయవలసిందిగా కోరారు.

***రాముని సమక్షంలో రామకథాగానం :*** లవకుశులు అయోధ్యలో ప్రవేశించి రామకథను శ్రావ్యంగా గానం చేస్తుంటే బజారులో ఎక్కడివారు అక్కడే నిలిచిపోయారు. వారి హృదయాలు ఆనందంతో నిండిపోయాయి. ఎక్కడ ఉన్నాము, ఏమి చేస్తున్నామనే చింతనే లేదు వారికి. అదే భావసమాధి. ఆ సమయంలో రథము నెక్కి అటువైపు వచ్చిన రాముడు కూడా లవకుశుల రామకథాగానమును విని ముగ్ధుడయ్యాడు. తన భవనమునకు వచ్చి రామకథా గానం చేయవలసిందని తాను పిలచినట్లుగా లవకుశులకు

చెప్పమని ఇంటికి వచ్చిన తరువాత మంత్రులను పంపించాడు. ఈవిధంగా సామాన్య ప్రజల ముందేగాక సాక్షాత్తు శ్రీరామచంద్రుని సమక్షంలోను లవకుశులు రామకథను గానం చేశారు. రామచరితమును రాముడు కూడా విని ఆనందించాడు.

కుశలవులు ఎట్టి జంకుగాని, బిడియముగాని లేకుండా ప్రజల మధ్యకు వెళ్ళి రామకథను స్వేచ్ఛగా గానం చేస్తూ, ప్రచారం చేస్తూ వచ్చారు. కాని ఈనాటి ఆధునిక యువకులకు పదిమంది ముందర భగవన్నామాన్ని గానం చేయాలంటే బిడియం అడ్డు వస్తుంది. బయటికి వెళ్ళేటప్పుడు ఇంత బొట్టు పెట్టుకోవాలంటే అవమానంగా భావిస్తారు. రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేయాలంటే ఏదో కొంప కూలినట్లు బాధపడతారు. కాని లవకుశులు ఇట్టి దేహాభిమానాన్ని కూలద్రోసి ఆత్మాభిమానంతో రామాయణాన్ని గానం చేస్తూ వచ్చారు.

''పొద్దుపోక దూరివారి సుద్దులంటే
మీరు సిద్ధమవుదురే కడు శ్రద్ధతోడ
ముద్దు ముద్దుగాను భగవత్ ముచ్చటలు చెప్పువేళ
ఒద్దికగ నుండరే ఓ చెవులారా!
పనిమాలి సినిమాలు పలుమారు మీరు
చనిచని కనియును తనివి లేదె
క్షణమైన దైవసన్నిధి నిలువగ
కనులారా కడు కష్టమటే!''

ఎవరిని చూడవలసింది? కన్నుల నిచ్చినది ఎందుకోసం? చెవుల నిచ్చినది ఎందుకోసం? భగవంతుని చూడాలి. భగవన్నామాన్ని స్మరించాలి. భగవత్సన్నిధి చేరాలి. కనుక ఈనాటి యువకులు లవకుశుల ఆదర్శాన్ని అనుసరించడానికి కంకణం కట్టుకోవాలి. దేహాభిమానమును త్యజించి భగవద్విషయాన్ని జగత్తులో ప్రచారం చేయడానికి పూనుకోవాలి. ఆ నామములో ఉన్న మాధుర్యమును, ఆ స్మరణలో ఉన్న దివ్యత్వమును, ఆ చింతనలో ఉన్న పవిత్రతను గుర్తించాలి. అతడు నిరంతరము కల్యాణరాముడే, నిరంతరము కోదండ రాముడే, నిరంతరము పట్టాభిరాముడే. హృదయమే అతని సామ్రాజ్యము. హృదయంలోనే తన పట్టాభి షేకమును జరిపించుకుంటున్నాడు. అందువల్లనే త్యాగరాజు చెప్పాడు -

''రామా కోదండరామా
రామా పట్టాభిరామా
రామా కల్యాణరామా రాఘవా!
రామా నీ కొర్కె మాట, రామా నా కొర్కె మాట
రామా నీ పాటే పాట రామా నీ బాటే బాట
రామా సీతాపతి, రామా నీవే గతి
రామా నీకు మ్రొక్కితి, రామా నీ చేజిక్కితి
రామా నీ చింతనె చాలు, రామా నీ నామమె మేలు
రామనామమె మేలు, రామచింతనె చాలు
రామచింతనె చాలు, రామనామమె మేలు
రామా నేను నీవాడు, రామా నాతో మాటాడు
రామా కోదండరామా....''

ఈవిధంగా రామచరితమును, రాముని గుణగణములను కొనియాడుతూ వచ్చారు పరమ భక్తులు. ఇంత పవిత్రమైన చరిత్ర ఏ దేశముయందుగాని, ఏ భాషయందుగాని కనిపించదు. రామాయణము జరిగి ఎన్నో వేల సంవత్సరములు గడిచిపోయినప్పటికీ ఈనాటికీ ఊరుఊరుయందు, వాడవాడయందు రామచింతన జరుగుచునే ఉన్నది. భారతదేశంలో రామనామం తెలియనివాడు కనిపించడు. ఏ చిన్న పల్లెలోనైనా రామమందిరం కనిపిస్తుంది. అయితే హృదయ

మందిరమే మనకు ప్రధానంకాని బాహ్యమైన మందిరాలు కాదు. భగవంతుడు హృదయవాసి; తిరుపతివాసి కాదు, భద్రాచలవాసి కాదు, వైకుంఠవాసి కాదు, కైలాసవాసి కాదు. అవన్నీ బ్రాంచాఫీసులు, హెడ్‌ఆఫీసు హృదయమే. కనుక మీరు భగవంతునికోసం ఎక్కడా తిరుగనక్కరలేదు, నయాపైసా ఖర్చు చేయనక్కరలేదు. కానీ ఖర్చు లేకుండా, కాలు గడపదాటకుండా కైవల్యం ఒళ్ళో ఉట్టిపడినట్లుగా రాముడు హృదయంలోనే ఉంటున్నాడు.

మనం రామజన్మభూమియందు జన్మించి, రామజన్మదినమును జరుపుకుంటున్నప్పటికీ రామతత్వాన్ని గుర్తించుకోలేక పోతున్నాము. మహనీయుల జన్మదినములను జరుపుకోవడం గొప్పతనం కాదు, వారి ఆదేశములను ఆచరణలో పెట్టాలి. ఆచరణలో పెట్టడమే నిజమైన ఆస్తికత్వము. ఈనాడు మనం హృదయాన్ని విస్మరించి శరీరంతో సాధనలు చేస్తున్నాము. అవన్నీ నిరుపయోగమైన సాధనలు, నయాపైసా విలువలేని సాధనలు! "నిమిష నిమిషమునకు నీచులూరునె గాని పునుగు జవ్వాదీలు పుట్టబోవు." ఇట్టి దేహముతోనా మనం సాధనలు చేయడం! ఈ దేహము ఎప్పుడు కూలుతుందో! ఎప్పుడు రాలుతుందో! ఇది రాలే లోపలనే, కూలే లోపలనే మనం దివ్యత్వాన్ని అనుభవించాలి. ఇదే వాల్మీకి బోధించినది. అతడు రత్నాకరుడుగా ఉన్నప్పుడు ఎందరి ప్రాణములనో తీసాడు. కాని చివరికి రామ నామమును స్మరించేసరికి తన దేహాన్ని మరచిపోయాడు. అతనిచుట్టూ పుట్టలు పెరిగాయి. అయినా "రాం, రాం, రాం, రాం,..." అని జపిస్తూనే ఉన్నాడు. కాని మనం ధ్యానం చేసేటప్పుడు ఒక చిన్న దోమ వచ్చి మనమీద వ్రాలిందంటే దానిని కొట్టేస్తాము. ఒక చిన్న దోమ వ్రాలితేనే సహించుకోలేని బలహీనులం ఇంక ఏరీతిగా భగవంతుని సాధించగలం! కష్టనష్టములకు వెఱువక లక్ష్యాన్ని భగవంతునిపై పెట్టుకోవాలి.

"చిక్కిన సాయిని వక్కలేయక చక్కచేసుకోండి
పోయిన చిక్కదు పర్తీశుని ఈ పాద సేవనండి
భక్తిని ఇచ్చి శక్తిని పెంచి ముక్తి జేర్చునండి
ఇతరుల మాటలు ఇంపుగ నమ్మి కొంపదీయకండి
రండి, మేలుకొండి, మాయను మరువండి"

ఈవిధమైన దివ్యభావాన్ని పెంచుకోవాలి. ఏ దానియందైనా ఎక్కువ అభిమానం పెట్టుకోకూడదు. అయితే మన కర్తవ్యాన్ని మనం నిర్వర్తించాలి. ఆనాటి అయోధ్యావాసు లందరూ తమ కర్తవ్యంపై లక్ష్యం పెట్టుకున్నవారేగాని అధికారం నిమిత్తమై అఱ్ఱులు జాచినవారు కాదు. అందువల్లనే వారు తరించారు. రాముడు వెళ్ళిన తక్షణమే వారు కూడా అనుసరించారు. "నీవు లేని బ్రతుకు మాకెందుకు! నీవే మా సర్వస్వము. కనుక మమ్మల్ని కూడా నీతోపాటు తీసుకువెళ్ళు రామా!" అని ప్రార్థించారు. అదే నిజసంబంధము. అదే ఆత్మసంబంధము. ఆనాటి రాముణ్ణి ఈనాడు మనం దర్శించుకుంటున్నామంటే, ఆనాటి రాముణ్ణి ఈనాడు మనం అనుభవిస్తున్నామంటే ఇది మన అదృష్టమని గుర్తించాలి. ఆ రామతత్వమును మన హృదయంలో ప్రతిష్ఠించుకోవాలి.

"రామో విగ్రహవాన్ ధర్మః" ధర్మము, రాముడు వేరువేరు కాదు. రాముడే ధర్మము, రావణుడే అధర్మము. ధర్మాధర్మముల చదరంగమే ఈ జీవితము. అయితే ధర్మము రెండు రకములు.

1.స్వధర్మము 2.పరధర్మము. స్వధర్మమంటే ఏమిటి? క్షత్రియధర్మము, బ్రాహ్మణధర్మము, శూద్రధర్మము మున్నగునవి కాదు. స్వ - అనగా ఆత్మ. కనుక ఆత్మధర్మమే స్వధర్మము, దేహధర్మమే పరధర్మము.

ఆనాడు దశరథుని మంత్రులు ఎనిమిది మంది. వారెలాంటి వారు? నీతినిజాయతీలతో కూడిన వారు, ఇంద్రియ నిగ్రహం కలవారు, సత్యవాక్పరి పాలకులు. అలాంటి మంత్రులు, వశిష్ఠవామదేవుల వంటి గురువులు, దశరథునివంటి రాజు ఉంటే ఇప్పుడు కూడా దేశం రామరాజ్యంగా మారిపోతుంది. దశరథు డనగా ఎవరు? దశేంద్రి యములతో కూడిన ఈ దేహమే ఒక రథము. ఇందులో ఆత్మాభిమానియైన రాజు ఉంటున్నాడు. అతడే దశరథుడు. సత్త్వరజస్తమో గుణములే అతని ముగ్గురు భార్యలు. ఈ ముగ్గురు భార్యలకు ధర్మార్థ కామ మోక్షములనే నల్గురు కొడుకులు పుట్టారు. ధర్మము రాముడు, మోక్షము భరతుడు, అర్థకామములు లక్ష్మణశత్రుఘ్నులు. ఈనాడు మానవుడు ధర్మమోక్షములను విస్మరించి అర్థకామముల నిమిత్తమై ప్రాకులాడుతున్నాడు. ఇది రామభక్తికి సరియైన లక్షణం కాదు. జానెడు పొట్టకు పట్టెడన్నం పెట్టలేడా భగవంతుడు? పైరు నాటిన వాడు నీరు పోయక మానడు. ఇట్టి నమ్మకాన్ని అభివృద్ధి పర్చుకోవాలి. ఇది లేకుండా ఎన్ని చోట్లకు తిరిగినా శాంతి చిక్కదు. కారణ మేమిటి? ఈ లోకంలో ఎక్కడా శాంతి లేదు. దృష్టిని హృదయం వైపు మరల్చాలి. హృదయంలో మాలిన్యం నింపుకొని శాంతి కావాలంటే ఎలా చిక్కుతుంది? ముందు ఆ మాలిన్యాన్ని ఊడ్చిపారవేయాలి. గలీజుగా ఉన్న చీపురుతో ఊడ్చితే ఇల్లు కూడా గలీజైపోతుంది. మన మనస్సే ఒక చీపురు. ముందు దానిని పరిశుద్ధం గావించుకోవాలి. అది భగవదర్పిత మైనప్పుడే పరిశుద్ధ మవుతుంది. కనుక ప్రేమచేత రామచింతన చేయండి, విశ్వాసంచేత రాముణ్ణి స్మరించండి. ప్రేమ, విశ్వాసములే మానవుని ప్రధానమైన ప్రాణములు.

*[తేది: **16.4.97**న సాయిరమేశ్ హాల్ (బృందావనం)లో శ్రీవారు అనుగ్రహించిన దివ్య సందేశము నుండి]*

---

## భజనలో భావమే ముఖ్యం

*ఒక తుపాకీలో మందువేసి కొట్టితే శబ్దము వచ్చును, వేటు తగులును. ఆరీతిగనే హృదయంలో భావమనే గుండును పెట్టితే రాం, రాం, రాం అనే సంకీర్తన శబ్దముతోపాటు వేటు తగులును. భావము లేకపోతే ఒట్టి శబ్దమేగాని ఏమీ ఫలితముండదు. భావముతో చేరిన పాటే నిజమైన పాట. గ్రామ్‌ఫోన్ కూడా పాడుతుంది. దానికి భక్తి ఎక్కడిది! దైవప్రీతి కొరకు భజన సలుపండి, మానవుల మెప్పుకొరకు కాదు.*

*- బాబా*

# శ్రీవారి మద్రాసు పర్యటన విశేషాలు

మద్రాసు నగరంలోని అసంఖ్యాక భక్తుల చిరకాల ప్రార్థనను మన్నించి భగవాన్‌బాబావారు ఏప్రిల్10,11 తేదీలలో 'సుందరం'లో తమ దివ్యదర్శన భాగ్యాన్ని ప్రసాదించి భక్తులను ఆనందాబ్ధిలో ఓలలాడింప జేశారు. సుమారు యాభై నెలల సుదీర్ఘ విరామం తరువాత మళ్ళీ భగవానుని శుభాగమనంతో మద్రాసులోని సాయిభక్తులకు మండువేసవిలో నిండుపున్నమి వెన్నెల విరిసినట్లయినది. ఏప్రిల్ 10వ తేది తెల్లవారు ఝాము న నాలుగున్నర గంటలకు శ్రీవారు త్రయీబృందావనం నుండి కారులో బయలుదేరి సరిగ్గా పదిన్నర గంటలకు 'సుందరం' చేరుకోగా వేలాది భక్తులు జయజయధ్వానాలతో స్వాగతం పలికారు. మంగళ వాయిద్యాలు మారుమ్రోగగా, వేదమంత్రఘోష మిన్నంటగా శ్రీవారు 'సుందరం'లోకి ప్రవేశించి నూతనంగా నిర్మింపబడిన భజనమందిరానికి ప్రారంభోత్సవం జరిపారు. అటుపిమ్మట మందిరానికి ఉత్తరాన ఉన్న షిర్డీబాబా గుడికి వెళ్ళారు. అక్కడ నక్షత్రాకృతిలోనున్న ఒక రత్నఖచిత సువర్ణాభరణాన్ని సృష్టించి షిర్డీబాబా విగ్రహం నుదుట అలంకరించగా భక్తుల ఆనందానికి అవధులులేవు. సాయంత్రం నాల్గున్నర గంటలకు ప్రారంభమైన బహిరంగ సమావేశంలో ముందుగా తమిళనాడు రాష్ట్ర సత్యసాయి సేవాసంస్థల అధ్యక్షులు శ్రీ టి.జి. కృష్ణమూర్తి మాట్లాడుతూ, తమ చిరకాల ప్రార్థనను మన్నించి మద్రాసుకు విచ్చేసినందులకుగాను శ్రీవారికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములను సమర్పించారు. అనంతరం శ్రీ సత్యసాయి ఉన్నత విద్యాసంస్థ మాజీ వైస్‌చాన్స్‌లర్ ప్రొ॥ సంపత్ తమిళంలో కొద్దిసేపు ప్రసంగించారు. శ్రీవారి దివ్యసందేశానంతరం మంగళహారతితో కార్యక్రమం పరిసమాప్తమైనది.

11వతేది తెల్లవారు ఝామున జరిగిన బ్రహ్మాండమైన నగరసంకీర్తనలో సుమారు ఇరవైవేల మందికి పైగా భక్తులు పాల్గొనడంతో 'సుందరం'కు దారితీసే గ్రీన్‌వేస్ మరియు చామియర్స్ రోడ్లపై వాహనాల రాకపోకలు పూర్తిగా స్తంభించిపోయాయి. నగరసంకీర్త నానంతరం 'సుందరం' బాల్కనీ నుండి శ్రీవారు తమ దివ్యదర్శన భాగ్యాన్ని అనుగ్రహించి ఆశీర్వదించారు. ఉదయం ఏడున్నర గంటలకు భజన జరిగింది. సాయంత్రం జరిగిన బహిరంగ సమావేశంలో మధురై, అన్నామలై విశ్వ విద్యాలయాల మాజీ వైస్‌చాన్స్‌లర్ ప్రొఫెసర్ చిట్టిబాబు ప్రసంగిస్తూ, శ్రీసత్యసాయి ఉన్నత విద్యాసంస్థ అనుసరిస్తున్న సమగ్ర విద్యావిధానం ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఇతర విద్యాసంస్థలకు ఆదర్శప్రాయమని, మార్గదర్శకమని కొనియాడారు. (ఈ సందర్భంగా శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశం ఈ సంచికలోనే ప్రచురింపబడింది.) మరునాడు తెల్లవారుఝామున యథాప్రకారంగా భక్తులు అధిక సంఖ్యలో ప్రొద్దై కుంభవృష్టిని సైతం లెక్కచేయక భక్తిశ్రద్ధలతో నగరసంకీర్తనలో పాల్గొన్నారు. వారందరికీ శ్రీవారు తమ అనుగ్రహాశీస్సుల నందజేస్తూ సరిగ్గా ఏడున్నర గంటలకు 'సుందరం' నుండి బృందావనానికి బయలుదేరారు.

# నామస్మరణ విశిష్టత

''తరువ తరువ పుట్టు తరువున అనలంబు
తరువ తరువ పుట్టు దధిని ఘృతము
తరువ తరువ పుట్టు తనువున తత్వంబు
వినుడు భారతీయ వీరసుతుడ!''

కట్టెకు, కట్టెకు మధ్య రాపిడి జరిగినప్పుడు అగ్ని ఆవిర్భవిస్తుంది. పెరుగును బాగా చిలికినప్పుడు అందులో వెన్న పుడుతుంది. అదేవిధంగా మన హృదయంలో రూపము, నామము ఒకదానితోనొకటి రాచుకున్నప్పుడే దివ్యత్వము సాక్షాత్కరిస్తుంది. దైవము సర్వత్ర ఉన్నాడు. సూర్యుడు లేక సూర్యకిరణములు ఏవిధంగా ఉండవో అదేవిధంగా దైవము లేక ఈ జగత్తే లేదు.

ఈ ప్రపంచము శాశ్వతమని, ఇదే ప్రధానమని ఈనాటి యువకుల విశ్వాసము. ఇది చాల పొరపాటు. ''అనిత్యం అసుఖం లోకమిమం ప్రాప్య భజ స్వమాం'' అన్నాడు గీతాచార్యుడు. మార్పులు, కూర్పులు చెందనటువంటిది, సత్యనిత్యమైనటువంటిది ఒక్క దివ్యత్వము మాత్రమే. ఇలాంటి దివ్యత్వాన్ని విస్మరించి, లౌకికవిషయాలలో ఆనందంకోసం ఈనాటి యువకుడు అనేక విధములుగా ప్రాకులాడుతున్నాడు. మొట్టమొదట చదువులో ఆనందమున్నదని చదువుతున్నాడు. తరువాత ఉద్యోగమువల్ల ఆనందము కల్గుతుందని ఉద్యోగము చేస్తున్నాడు. తరువాత పెండ్లి చేసుకుంటే ఆనందము కల్గుతుందని వివాహమాడుతున్నాడు. తరువాత కొడుకులు పుడితే ఆనందము లభిస్తుందని భావిస్తున్నాడు. కాని చివరికి ఎందులోను ఆనందము పొందలేకపోతున్నాడు. అన్నింటియందు అశాంతే! అశాంతే! అశాంతే! ఈ అశాంతికి కారణమేమిటి? కోరికలే! హృదయ పరిశుద్ధత లోపించడంవల్ల ఈనాడు మానవునికి అనేక రోగములు ప్రాప్తిస్తున్నాయి. ఎన్ని సాధనలు చేసినప్పటికీ, ఎన్ని పుణ్యక్షేత్రములు తిరిగినప్పటికీ, ఎన్ని పూజలు సల్పినప్పటికీ చిత్తశుద్ధి లేకపోతే ప్రయోజనం లేదు. ఇవన్నీ కేవలం మానసిక తృప్తి కోసం చేస్తున్నాము. అయితే మనస్సును తృప్తి పర్చడం ఎవరి తరమూ కాదు. ''చంచలం హి మనః కృష్ణా ప్రమాది బలవద్దృఢం'' అన్నాడు అర్జునుడు. మనస్సు మహాచంచలమైనది. ఇట్టి మనస్సును ఎవరు తృప్తి పర్చగలరు? ఎవరు అరికట్టగలరు? మనస్సు యొక్క ప్రభావముచేతనే మానవునికి సంసారమనేది చేకూరుతున్నది. ఆకాశాన్ని ముక్కలు చేయవచ్చును, గాలిని మూట కట్టవచ్చును, సముద్రాన్ని ఒక్క గుక్కలో త్రాగవచ్చును. కానీ మనస్సును మాత్రం స్థిరంగా నిల్పుటకు వీలుకాదు. చంచలత్వము మనస్సుకు సహజం. ఇది ప్రకృతి నియమం. కనుక మనస్సును అరికట్టడానికి ప్రయత్నించడంవల్ల ప్రయోజనం లేదు. మనస్సును భగవంతునివైపు మరల్చాలి. దీనినే భక్తి అన్నారు.

***రామనామ దివ్యమహిమ:*** ఒకానొక సమయంలో కౌసల్య వద్దకు ఒక స్త్రీ వచ్చింది. ''అమ్మా! నీ వెవరు?'' అని కౌసల్య ప్రశ్నించింది. ఆమె, ''నేనెవరో నీకు తెలియదా? పెద్దసముద్రాన్ని ఒక్క అంగలో దాటిన హనుమంతుని తల్లిని నేను'' అన్నది. వీరిద్దరూ సంభాషణ జరుపుతున్న సమయంలో మరొక స్త్రీ వచ్చింది. ఆమెను చూసి కౌసల్య, ''ఎవరమ్మా నీవు?'' అని ప్రశ్నించగా, ''హనుమంతుడు దాటిన సముద్రాన్ని ఒక్క గుక్కలో త్రాగివేసిన అగస్త్యుని తల్లిని నేను'' అన్నది. అప్పుడు కౌసల్య ఫక్కున నవ్వి, ''నీ కుమారుడైన హనుమంతుడు సముద్రాన్ని దాటడానికిగాని, నీ కుమారుడైన అగస్త్యుడు సముద్రాన్ని త్రాగడానికిగాని నా కుమారుడైన శ్రీరామచంద్రుని నామమే ఆధారం'' అన్నది. ఈవిధంగా ముగ్గురు ఆడవాళ్ళూ చేరి తమలో తాము నేను గొప్ప అంటే నేనే గొప్ప అని వాదించుకోసాగారు. ''మువురాడవారు చేరిన సుగుణాకర! పట్టపగలు చుక్కలు రాలున్.'' ముగ్గురు ఆడవాళ్ళు ఒకచోట చేరారంటే పగటిపూట కూడా నక్షత్రాలు క్రిందికి రాలుతాయట! ఆ సమయంలో అక్కడికి రాముడు వచ్చాడు. ''అమ్మా! దేని గురించి మీరు వాదులాడు తున్నారు?'' అని అడిగాడు. అప్పుడు కౌసల్య, ''నాయనా! ఈమె హనుమంతుని తల్లి, ఈమె అగస్త్యుని తల్లి. వీరిరువురూ తమ కుమారులు చేసిన ఘనకార్యముల గురించి గొప్పగా చెప్పుకుంటున్నారు. కాని, నీ నామమును స్మరించడం వల్లనే కదా హనుమంతుడు సముద్రాన్ని దాటగల్గాడు. నీ నామమును తల్చుకోవడంవల్లనే కదా అగస్త్యుడు సముద్రాన్ని త్రాగగల్గాడు. ఇదంతా నీ అనుగ్రహ ప్రభావమే. కనుక నీలాంటి కుమారుని కన్న నేనెంత అదృష్టవంతురాలిని!'' అన్నది. అప్పుడు రాముడు, ''అమ్మా! ఇది నా అనుగ్రహం కాదు. 'రామ' అనేది ఈ దేహమునకు పెట్టిన పేరు. ఈ నామమహాత్మ్యమే ఇన్ని ఘనకార్యములు చేయగల్గింది. ఈ నామమును ఈ దేహానికి పెట్టడంచేతనే నేను కూడా మహావీరుడైన రావణుని జయించగల్గాను'' అన్నాడు.

***సర్వులను సంరక్షించేది భగవన్నామమే:*** అన్నింటికీ నామమే ప్రధానము. భగవన్నామస్మరణచేతనే సర్వశక్తులూ మనయందు ఆవిర్భవిస్తాయి. ద్రౌపది మీకు తెలుసు. ఆమె భర్తలు చాల గొప్పవారు, ధర్మమూర్తులు. కాని నిండుసభలో దుర్యోధనుడు ఆమెను పరాభవించడానికి పూనుకున్నప్పుడు అర్జునుడుకాని, భీముడుకాని ఎవ్వరూ ఆమెకు సహాయం చేయలేదు. కట్టకడపటికి ఆమె, ''కృష్ణా! ఆపద్బాంధవా!'' అని స్మరించేసరికి కృష్ణుడే వచ్చి ఆమెను ఆదుకున్నాడు. సర్వులను సంరక్షించేది భగవన్నామమే. కనుక దీనిని మనం అలక్ష్యం చేయరాదు. నామమనేది చాల చిన్న పదము. కాని, ఈ రెండక్షరాలలోనే యావత్ప్రపంచము ఇమిడియున్నది. నామస్మరణే తరణోపాయం. నామమే మనలను సంసార సాగరాన్ని దాటించే నావ.

***వాతావరణపవిత్రతకు నామస్మరణ అత్యవసరం:*** మనం చేసే శబ్దములన్నీ గాలిలోని విద్యుత్ తరంగములతో చేరి ప్రపంచమంతా వ్యాపించి పోతున్నాయి. ఢిల్లీ రేడియో స్టేషన్‌లో ఎవరో మాట్లాడితే ఆ శబ్దతరంగములు ప్రపంచమంతా

ప్రాకిపోతున్నాయి కదా! ఈనాటి ప్రపంచము అశాంతితో నిండియున్నది. అనేక దుశ్శబ్దములు వాతావరణంలో చేరడంచేత అందరికీ దుర్బుద్ధులే పుడుతున్నాయి. మానవునిలో సద్భావములు రావాలంటే వాతావరణము పవిత్రమైనదిగా ఉండాలి. మంట ఎటువంటిదో పొగ అటువంటిది. పొగ ఎటువంటిదో మేఘము అటువంటిది. మేఘము ఎటు వంటిదో వర్షము అటువంటిది. వర్షము ఎటువంటిదో పంట అటువంటిది. పంట ఎటువంటిదో వంట అటువంటిది. వంట ఎటువంటిదో బుద్ధులు అటువంటివి. కనుక మన బుద్ధులకు మూలకారణం మనం భుజించే ఆహారమే. ఈ ఆహారము వాతావరణముపై ఆధారపడియున్నది. ఈ వాతావరణము మానవుని ప్రవర్తనపై ఆధారపడి యున్నది. ''మేడిపండు చూడ మేలిమై యుండును, పొట్ట విప్పి చూడ పురుగులుండు.'' చూడటానికి అందరూ భక్తులుగానే కనిపిస్తారు. కాని హృదయం విప్పి చూస్తే అన్నీ పురుగులే! కనుక మొట్టమొదట హృదయవాతావరణమును పవిత్రమైనదిగా మార్చుకోవాలి. దీని నిమిత్తమై నామస్మరణ అత్యవసరం. నామ మనేది చాల విలువైనది, ఘనమైనది, పవిత్రమైనది. ఎంత పవిత్రమైన భావముతో మనం నామము నుచ్చరిస్తామో వాతావరణం అంత పవిత్రమైనదిగా మారుతుంది. మనం చేసే భజనలు వాతావరణాన్ని పవిత్రం చేయాలి. బయటి వాతావరణాన్ని పవిత్రం చేయడానికి ముందు మన హృదయాన్ని పవిత్రం గావించుకోవాలి. భగవంతుడు గానప్రియుడు, గానలోలుడు. అందువల్లనే తుంబురనారదులు నిరంతరము నారాయణునివద్ద గానం చేస్తుంటారట. లోకంలో ఎంతోమంది కవులు పద్యాలు అల్లుతుంటారు, కావ్యాలు వ్రాస్తుంటారు. కాని భగవంతుడు గానములో లీనమైనట్లుగా మరొక దానిలో లీనం కాడు. కనుక మీరు హృదయాన్ని ఆకర్షించేటట్లుగా భజనలు చేయాలి. మిమ్మల్ని మీరు మరచిపోయి గానం చేసినప్పుడే అది హృదయాన్ని ఆకర్షిస్తుంది. కనుక భజనలు చేసేవారు మొట్టమొదట హృదయంలో ప్రేమను నింపుకోవాలి. పవిత్రమైన హృదయంతో భజనలు చేసినప్పుడు ప్రపంచమంతా పవిత్రమైపోతుంది.

*భజనంటే ఎలా ఉండాలి?* : సంకీర్తన మనగా ఏమిటి? ''సమ్యక్ కీర్తనం ఇతి సంకీర్తనం.'' హృదయాన్ని కరిగించాలి, కదిలించాలి. అప్పుడే అందరూ ఆనందాన్ని అందుకోగలరు. కనుక మీరు భజనలో కేవలం శ్రుతిలయరాగములను మాత్రమే చూసుకుంటే ప్రయోజనం లేదు. హృదయాన్ని విప్పి పాడాలి. భజన లీడ్ చేసేవాళ్ళు ఇంకొక విషయాన్ని కూడా గుర్తించాలి. మీరు భజన చేస్తుంటే ఎన్నో వేలమంది వింటున్నారు. కనుక అందరూ సులభంగా ఫాలో చేయగల పాటలను మీరు పాడాలి. మీ చుట్టూ ఎన్నో వేలమంది ఉన్నారనే విషయాన్ని మీరు మరువకూడదు. మీరు ఏవో పెద్దపెద్ద కీర్తనలు పాడితే ఎవ్వరూ ఫాలో చేయలేరు. ఫాలో చేయలేక పోవడంవల్ల వాళ్ళలో నిరుత్సాహం బయలుదేరుతుంది. చివరికి భజనలంటేనే విసుగు పుడుతుంది. కనుక మీరు రామా, కృష్ణా, గోవిందా, అల్లా, ఏసు మొదలైన చిన్నచిన్న నామములతో కూడిన పాటలు పాడాలి. అప్పుడు అందరూ సులభంగా ఫాలో చేయగల్గుతారు. భజనలో పెద్దపెద్ద చేన్తాళ్ళవంటి పదములను ఉపయోగపెట్టవద్దు. మీ ఇంట్లో ఒంటరిగా ఉన్నప్పుడు మీరేమైనా పాడుకోండి. కాని పదిమంది చేరినప్పుడు మాత్రం మీరు పాడే పాట అందరికీ

అర్థమయ్యే రీతిగా ఉండాలి. అందరూ పలకడానికి వీలయ్యేటటువంటి పాటలను మాత్రమే పాడాలి. మీరు చేసే భజనలు పదిమందికి ఆనందాన్ని పంచిపెట్టేవిగా ఉండాలి. ''నా ఇష్టం వచ్చిన పాట పాడుతాను. ఇతరులు ఫాలో చేస్తే చేయనీ, పోతే పోనీ'' అనే స్వార్థచింతన ఉండకూడదు. ''నేను పాడే పాట అందరూ ఫాలో చేయగలరా? లేదా?'' అని విచారణ చేయాలి. భజనలో పాల్గొనే వారిలో అనేకమంది విదేశీయులు కూడా ఉంటారు. వారికి నామస్మరణంటే చాల ఇష్టం. కనుక మీరు పాడే పాటలు వారికి కూడా అర్థమయ్యే రీతిగా ఉండాలి.

*''హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం*
*కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా''*

కలియుగంలో నామస్మరణను మించినది లేదు. ''సాయిబాబా భక్తులంటే ఊరికే భజనలు చేస్తుంటారంతే! ఏ సాధనా లేదు'' అని కొంతమంది మూర్ఖులు విమర్శిస్తుంటారు. నామస్మరణలో ఎంత మాధుర్యమున్నదో వారికేమి తెలుసు? అందువల్లనే 'ఏకాత్మా సర్వభూతాంత రాత్మ' అని అద్వైత సిద్ధాంతాన్ని ప్రబోధించిన శంకరాచార్యులవారు కూడా కట్టకడపటికి, 'భజగోవిందం ...' అంటూ ద్వైతంలోకి దిగాడు.

*సర్వమత సమానత్వం:* ఏ మతాన్నీ మీరు ద్వేషించకూడదు. ఏ వ్యక్తినీ మీరు కష్టపెట్టకూడదు. అందరిలోను సమత్వాన్ని, ఏకత్వాన్ని దర్శించాలి. హృదయంలో అసూయాద్వేషాలను నింపుకొని మీరు ఎంత భజన చేసినా ప్రయోజనం లేదు. అన్ని మతముల సారమొక్కటే. అన్ని నామముల గమ్యమొక్కటే. ఈ ఏకత్వాన్ని మీరు మొట్టమొదట విశ్వసించాలి. అల్లాను ప్రార్థించేవారు మహమ్మదీయులని, ఏసును ప్రార్థించేవారు క్రైస్తవులని ఈవిధమైన భేదభావములను మీరు పెట్టుకోకూడదు. అందరూ భగవంతుని బిడ్డలే. అయితే ఎవరి స్థితిగతులకు తగిన మార్గాన్ని వారు అనుసరిస్తూ వస్తున్నారు. నీటిని ఇంగ్లీషువారు 'వాటర్' అని, తమిళంవారు 'తన్నీ' అని, హిందీ వారు 'పానీ' అని ఈవిధంగా వేర్వేరు పేర్లతో పిలుస్తారుకాని, నీటిని ఎవ్వరూ మార్చలేరు కదా! అదేవిధంగా భగవంతునికి ఎవరికి తోచిన రూపనామములను వారు పెట్టుకొని ఆరాధిస్తున్నారు కాని, భగవంతుడు ఒక్కడే, ఒక్కడే, ఒక్కడే.

*బంధవిమోచనకు మార్గములు రెండు:* మానవుడు ప్రాపంచిక విషయములనే త్రాళ్ళచేత కట్టుబడ్డాడు. ఈ బంధనల నుండి విముక్తి కావాలంటే మానవుడు ఏమి చేయాలి? దీనికి రెండు మార్గములు మాత్రమే ఉన్నాయి. ఒకటి సేవామార్గము, రెండవది జ్ఞానమార్గము. సేవామార్గంలో భక్తుడు, ''దాసోహం, దాసోహం'' అనే భావనతో అహంకారాన్ని తగ్గించుకొంటూ రావాలి. అప్పుడు 'త్రాళ్ళు' వదులైపోతాయి. ఇంక జ్ఞానమార్గంలో ''శివోహం, శివోహం'' (నేనే దైవం) అనే భావనతో అనంతమైన ఆత్మతత్వంగా పెరుగుతూ పోవాలి. అప్పుడు 'త్రాళ్ళు' ఒక్కసారిగా తెగిపోతాయి. కనుక బంధవిమోచన కావాలంటే జ్ఞానమార్గంలోనైనా పోవాలి, లేక సేవా మార్గంలోనైనా పోవాలి. ఎట్టి పరిస్థితిలోను అహంకారమునకు అవకాశ మివ్వకూడదు. ఏవో రెండు మిరపకాయలు తింటేనే నాలుకకు ఎంతో కారంగా ఉంటుంది. ఇంక అహం'కారము' సంగతి ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు. అసలు దేనిని చూసి నీకు అహంకారము?

ఒక చిన్న ఉదాహరణ: ఈ ప్రపంచమ్యాపులో ఇండియా చాల చిన్నది. ఇండియాలో మద్రాసు స్టేట్ మరింత చిన్నది. ఈ మద్రాసుస్టేట్‌లో మీ ఇల్లు ఎంతో చిన్నది. **ఇంక** మీ ఇంట్లో నీవెంత! ఇంత చిన్నవాడవైన నీవు విశాలమైన ప్రపంచంపై అహంకారపడటం ఎంత పిచ్చితనం! ఈ ప్రపంచంలో నీ స్థానమును నీవు గుర్తిస్తే అహంకారమునకు అవకాశమే లేదు.

ఈనాడు ఎవరి స్వార్థంకోసం వారు పాటు పడటంవల్ల దేశం ఎన్ని కష్టనష్టములకు గురియగు చున్నదో మీకు తెలుసు. రాజకీయ రంగంలో అశాంతి మితిమీరిపోతున్నది. కారణ మేమిటి? స్వార్థం, స్వార్థం, స్వార్థం! ప్రతి ఒక్కరు సీటుకోసం పాటుపడుతున్నారేకాని, ప్రజలకోసం ఎవ్వరూ పాటుపడటం లేదు. 'నా పవర్, నా చైర్' అని పదవిని పట్టుకొని వ్రేళ్ళాడుతున్నారేగాని ప్రజల సంగతి ఎవ్వరూ పట్టించుకోవడం లేదు. చైర్ ఎంతకాలం ఉంటుంది? దేహమే కూలిపోతుంటే చైర్ మాత్రం స్థిరమా? కనుక స్వార్థాన్ని త్యజించి విశాలమైన భావాలను పెంచుకోండి, భగవన్నామాన్ని స్మరించండి, పవిత్రమైన జీవితాన్ని గడపండి.

*[తేది: **11.4.97**న 'సుందరం' (మద్రాసు)లో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి]*

---

## శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్,

ప్రశాంతినిలయం - **515 134** అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా
దిగుమతిదారు / ఎగుమతిదారు కోడ్‌నెంబరు **0990001032**
రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా ఎగుమతి దారుల కోడ్‌నెంబరు. **2001198**

**ప్రస్తుతం మా వద్ద లభ్యమవుతున్న పుస్తకముల జాబితా**

| వరుస నెంబరు | పేరు | ధర రూ.పై | వరుస నెంబరు | పేరు | ధర రూ.పై |
|---|---|---|---|---|---|
| 1. | ఉపనిషత్ వాహిని | 8-50 | 13. | ప్రేమ వాహిని | 9-00 |
| 2. | గీతా వాహిని | 18-00 | 14. | విద్యా వాహిని | 12-00 |
| 3. | ధర్మ వాహిని | 8-50 | 15. | సూత్ర వాహిని | 8-50 |
| 4. | ప్రశాంతి వాహిని | 11-00 | 16. | అద్భుతమూర్తి | 37-00 |
| 5. | ప్రశ్నోత్తర వాహిని | 10-00 | 17. | ఆత్మారామమ్ | 23-50 |
| 6. | భాగవత వాహిని | 18-00 | 18. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1978) | 18-00 |
| 7. | రామకథారస వాహిని (1వ భాగం) | 17-50 | 19. | నీలగిరి వేసవి వెన్నెల (1976) | 14-00 |
| 8. | రామకథారస వాహిని (2వ భాగం) | 18-00 | 20. | భజనావళి | 21-00 |
| 9. | లీలాకైవల్య వాహిని | 4-50 | 21. | మనస్సు - మర్మము | 14-00 |
| 10. | సత్యసాయి వాహిని | 14-00 | 22. | సందేహ నివారిణి | 10-50 |
| 11. | జ్ఞాన వాహిని | 11-00 | 23. | చిన్నకథ (1వ భాగం) | 17-00 |
| 12. | ధ్యాన వాహిని | 15-00 | 24. | చిన్నకథ (2వ భాగం) | 18-00 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 25. | చిన్నకథ (3వ భాగం) | 12-00 | 43. | సత్యసాయి సమర్చన | 15-00 |
| 26. | సత్యం శివం సుందరం (1వ భాగం) | 40-00 | 44. | ధర్మోద్ధారక శ్రీసత్యసాయి | 28-00 |
| 27. | సత్యం శివం సుందరం (2వ భాగం) | 43-00 | 45. | హృదయ పుష్పాలు | 15-00 |
| 28. | సత్యం శివం సుందరం (3వ భాగం) | 38-00 | 46. | పుష్పాంజలి | 20-00 |
| 29. | సత్యం శివం సుందరం (4వ భాగం) | 27-00 | 47. | మూఢమతి - ముక్తమతి | 23-50 |
| 30. | మణిమాల | 20-00 | 48. | పరీక్షితునితో పంచ దశాబ్దాలు | 27-00 |
| 31. | వచనామృతము | 18-50 | 49. | శ్రీసత్యసాయి దివ్య లీలామృతము | 15-00 |
| 32. | షిరిడి నుండి పుట్టపర్తి | 40-00 | 50. | ప్రేమజ్యోతి | 45-00 |
| 33. | యుగావతారీ సాయిశా | 25-00 | 51. | మాతృశ్రీ ఈశ్వరమ్మ | 44-00 |
| 34. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1993) | 27-00 | 52. | భక్తి రసాయనం | 18-00 |
| 35. | వాక్యవిభూతి | 6-00 | 53. | జయభేరి | 17-00 |
| 36. | ప్రేమసుధా స్రవంతి | 52-00 | 54. | శ్రీసత్యసాయి విన్నపములు | 17-00 |
| 37. | శ్రీసత్యసాయిగీతామృతము | 46-00 | 55. | పరమానంద శ్రీసాయి సన్నిధి | 5-00 |
| 38. | సాయిబాటలో నా పయనము | 55-50 | 56. | శ్రీసత్యసాయి అనుగ్రహం | 5-00 |
| 39. | ప్రబోధ పంచామృతము | 15-00 | 57. | మూలపురుషుడు శ్రీ సత్యసాయి | 5-00 |
| 40. | సనాతన సారథి 70వ జన్మదిన ప్రత్యేకసంచిక | 25-00 | 58. | శ్రీసత్యసాయీశోపనిషత్ | 5-00 |
| 41. | శ్రీసత్యసాయి గీతా | 30-00 | 59. | గీతామకరందం | 3-00 |
| 42. | శ్రీకృష్ణుడు - శ్రీసత్యసాయి | 28-00 | 60. | సౌందర్య కుసుమము | 3-00 |

పుస్తకాలను రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పంపడం జరుగుతుంది. ***''కన్వీనర్, శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతి నిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా, పిన్-515134''*** అనే చిరునామాకు ముందుగా మీకు కావలసిన పుస్తకాల ధర ఇండియన్ లేక ఇంటర్నేషనల్ మనియార్డరు ద్వారాగాని, డ్రాఫ్ట్ ద్వారాగాని పంపిన మీదట మావద్ద లభ్యమౌతున్న పుస్తకాలను పంపుతాము. పుస్తకాలను వి.పి.పి. ద్వారా పంపించటం జరుగదు.

***పోస్టు ఖర్చుల వివరాలు (మన దేశంలో)*** : ప్రతి 100 గ్రాములకు 0-50 పైసల చొప్పున 3 నుండి 5 పుస్తకాలు (సుమారు ఒక కేజి బరువు గల ప్యాకెట్) పంపడానికి పోస్టు ఖర్చు - రూ.లు 5/-, రిజిస్ట్రేషన్ ఖర్చు రూ.లు 10/-; మొత్తం రూ.లు 15/-; 4 నుండి 8 పుస్తకాలు (సుమారు రెండు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు 20/- ; 7 నుండి 10 పుస్తకాలు (సుమారు మూడు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు 25/-; 9 నుండి 15 పుస్తకాలు (సుమారు నాలుగు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు 30/-; 15 నుండి 20 పుస్తకాలు (సుమారు ఐదు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు 35/- అగును. ప్యాకింగ్ చేయుటకు పార్శిల్‌కు రూ.లు 20/-

***పోస్టు ఖర్చుల వివరాలు (విదేశాలకు)*** : 3 నుండి 5 పుస్తకములు (ఒక కిలో ప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు 59/-; విమానంలో పంపడానికి : రూ.లు 209/-; 4 నుండి 8 పుస్తకములు (రెండు కిలోల ప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు78/-; విమానంలో పంపడానికి: రూ.లు 378/-; 7 నుండి 10 పుస్తకములు (మూడు కిలోల ప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు 110/-; విమానంలో పంపడానికి: రూ.లు 560/-; 9 నుండి 15 పుస్తకములు (నాలుగుకిలోలప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు 140-; విమానంలో పంపడానికి: రూ.లు 740/-; 14 నుండి 20 పుస్తకములు (ఐదు కిలోలప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు 172/-; విమానంలో పంపడానికి: రూ.లు 922/- అగును. ప్యాకింగ్‌చేయుటకు పార్శిల్‌కు రూ.లు 30/- *జంబోకార్గో కొరియర్ డోర్ డెలివరీ* డి.హెచ్.ఎల్.సర్వీసు (10 కిలోల వరకు) : తూర్పుమధ్యదేశాలకు రూ.లు2000/-; ఆసియా పసిఫిక్‌దేశాలకు రూ.లు2500/-; యూరప్ మరియు యు.ఎస్.ఏ.లకు రూ.లు 3500/- ; ఇతర దేశాలకు రూ.లు 4500/- అగును. ప్రస్తుతపు విదేశీమారకపు రేట్లు: యు.ఎస్. $ = రూ.లు 34-00; కెనడియన్$ = రూ.లు 25-00; యు.కె.పౌండు=రూ.లు 52-00

